# స్కిడ్ చేయడమనేది



కొందరికి వినోదముగా నుండవచ్చును
కాని అది చాలా అపాయకరమైనది
అరిగిపోయిన టయర్ల నుపయోగించి అనేకమంది
ప్రాణములకేకాక, మీ కార్లకుకూడ అపాయమును
కలిగించుటెందులకు?

మీ టయర్లకు **టైయర్‌సోల్స్**

**ట్రీట్‌మెంట్** ఇవ్వండి.



టయర్‌సోల్స్ టయర్లకు పరిపూర్ణ రక్షణను ఇచ్చుచున్నది.
టయర్‌సోల్స్ ఇచ్చుచున్న ప్రత్యేక లోడెడ్ పొజిషన్ క్యూర్
(Exclusive loaded-position cure) మీ టయర్లను
త్రోవతో సమముగా అణచుటయేగాక (Better Road Holding)
రోడ్డుమీద పోవుచున్నప్పుడు ఉష్ణమును కలుగనీయకుండా,
చల్లదనము నిచ్చుచున్నది (cooler running)
అదియుమగాక టయర్లు చాలారోజులు మన్నికగ వచ్చుటకును,
ఎక్కువ మైళ్లు పోవుటకున్నూకూడా ఉపయోగపడుచున్నది.

---

తిరిగి
టయర్‌సోల్స్ తిరిగి క్రొత్తటయర్ మైలేజ్ ఇచ్చుచున్నది.

---

## స్టేన్స్ టయర్ & రబ్బర్ ప్రాడక్ట్స్ ప్రైవేట్ లిమిటెడ్.

తిరుచ్చి రోడ్, కోయంబత్తూరు, సౌత్ ఇండియా.
మరియు ఫ్యాక్టరీలు:
విజయవాడ, వెల్లూరు, మద్రాసు, మంగళూరు, తిరుచ్చి & కోట్టయం

TEL-EP-STR-2



గోవింద్ అతి సామాన్యుడు
ఆయనకొక భార్య.
పిల్లలు వున్నారు
చిన్న ఇల్లుకూడా వుంది
పిల్లలకు చదువు చెప్పించాడు
వారు పెరిగి పెద్దవారైన పిమ్మట
కలవారికి తన కూతుళ్లనిచ్చి పెళ్లిచేశాడు
కుమారుడికి మంచి ఉద్యోగం సంపాదించి పెట్టగలిగాడు
హాయిగా రిటైరు అయినాడు

# ఉత్తరాలు

## ము ఖ చి త్రం

జమునగారి ముఖచిత్రం అద్భుతం, అమోఘం! అమాయకమైన ఆ ముఖాన్ని 'ఎట్రాక్షన్'గావున్న ఆ కళ్ళనీ, ఎన్నిసార్లు చూచినా తనివి తీరడంలేదు......

ఉ. లలిత కుమారి ( మచిలీపట్టణము )

## చ దు వు ల్రా వు

క్లాసులో గోలపెట్టినంతమాత్రాన, లెక్చరర్స్‌ను ఏడిపించినంతమాత్రాన, అమ్మాయిలనుచూసి కాలరు పైకెత్తి వంకరలుతిరిగిపోయినంతమాత్రాన ఇంకా ఇలాటివే అరో, డజనో ఉండినంతమాత్రాన విద్యార్థులుపాడైపోతారన్న పెద్దల ఘోర దురభిప్రాయాన్ని వమ్ముచేసి ఫస్ట్‌క్లాస్‌లో పాసయినందుకు చదువుల్రావుకు మా 'కంగ్రాచ్యులేషన్స్.' నెక్స్ట్ ఇయరు యూనివర్శిటీ ఫస్ట్‌వస్తాడనే నమ్మకంతో మాకు పార్టీ ఎప్పుడు ఇస్తాడో తెలుపవలసిందిగా కోరుతూ....

రెడ్డి శేషగిరి, హేమగిరి ( బొంబాయి )

*     *     *

ఈ సంచిక (22—6—62) లో 'చదువుల్రావు' ప్రక్కన ఉన్నస్త్రీ ఆయన భార్యగారా? లేక స్నేహితురాలా?

యం. విద్యాసాగర్ ( చిత్తూరు )

**మాకు తెలిసినంతవరకు ఆయనకు పెళ్ళికాలేదు.**

*     *     *

చదువుల్రావు వేసికున్న షర్టులాంటి షర్టుకై నేను చాలా ప్రయత్నించాను. కాని నా కెచ్చటా లభ్యంకాలేదు. మరి చదువుల్రావు కది ఎట్లా లభ్యమయ్యిందో? బి. దామోదరరావు ( బెజ్వాడ )

*     *     *

8—6—1962 తేది వారపత్రిక 'ఉత్తరాలు' శీర్షికలో సత్యమూర్తిగారి కార్టూన్ గూర్చి శ్రీ కొట్టగడ్డ సుబ్బారావుగారి విమర్శ చదివినతర్వాత నాకు నిజంగానే ఆశ్చర్యం వేసింది. నేను ఇప్పటికి అనేకమంది డాక్టర్లు చెవిలో స్టెతస్కోపు తగిలించుకొని సంభాషించటము చాలసార్లు చూచాను. అలవాటులో పొరపాటునగాని, ఫోజుకుగాని తగిలించుకొని ఉండవచ్చునుగా!

మారం బాలిరెడ్డి (హైదరాబాద్)

## న రా గ మా ల

ఒక చిత్రంలో 7 పాటలు (అన్నీ 3 నిమిషాల వ్యవధి గలవే) ఉన్నవనుకోండి. మూడుప్లేట్లమీద (3×2) 6 పాటలు రికార్డు చేస్తారు. మిగిలిన ఒక్కపాటను ఒక ప్రక్క రికార్డుచేసి రెండవప్రక్క ఏంచేస్తారు? పి. నాగేశ్వరరావు ( గుడివాడ )

## కా ర్టూ న్ లు

8—6—62సంచికలో ఎప్పుడూ ఇంతే చూచుటకు చాలా బాగా ఉన్నదికాని సామాన్యంగా మనిషిముక్కు ఆవిధంగా 90 డిగ్రీలు కోణంలో ఉండటం అసహజమని నేను తలుస్తాను.

బొడ్డె హనుమంతరావు (విజయవాడ) ★

ప్రతివారం ఆంధ్ర దేశమంతటా లక్షలమంది ఆంధ్ర సచిత్ర వారపత్రికను చదివి ఆనందిస్తూ ఉంటారు. మీ స్థానిక ఏజెంటు ద్వారా చందాదారులయితే మీ కాపీ మీకు వారం వారం నిశ్చయంగా చేరగలదు.

## తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది!

# నవలావణ్య చర్మ సౌందర్యం మీ కొనవ్రేళ్ల మీదవున్నది.

మీ చర్మ సౌందర్యము పట్ల శ్రద్ధ వహించండి! దానిని నవలావణ్యమైన సొగసుగానుండు నట్లు హిమాలయా బుకే స్నో తో బాగా పోషించుకోండి ... అది అర్పుకు పోయి, వాడిలిన చర్మమునందు కొత్త జీవం పోస్తుంది. హిమాలయా బుకే స్నో మీ చర్మ సౌందర్యమును, ఎండ, గాలి, మొటిమలు, ముడతలు బారినుండి గుణవంతంగా కాపాడుతుంది.
మీ చర్మ సౌందర్యము పట్ల తగిన శ్రద్ధ వహించండి ... దానిని నవలావణ్యంగా వుంచుకొనుటకు ఉపయుక్తమైనది.

## హిమాలయా బుకే స్నో









# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం 29—6—62

సంపుటము : 54 సంచిక : 43

శుభ॥ సం॥ జ్యేష్ఠమాసం॥ బ॥ ద్వాదశి

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

విడి ప్రతి : 25 న. పై

సంవత్సర చందా : 13-0-0 రు.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి, మద్రాసు-1


★




ముఖచిత్రం :
వసంతశక్తి వారి 'కలిమిలేములు'లో
కృష్ణకుమారి.

## మనలోమాట

'(సి)నీతిచంద్రిక' రచయిత 'సుకుమార్' గారి పేరు 'ఆంధ్ర సచిత్రవారపత్రిక'లో పాఠకులు తరచు చూస్తారు. సినిమాకు సంబంధించిన శీర్షిక మరొకటి ఆయన తయారు చేస్తున్నారు. వివరాలు రాబోయే సంచికలలో చూడగలరు.

* * *

వి. ఎ. కె. రంగారావుగారి 'సరాగమాల'మీద చాలా ఉత్తరాలు వస్తున్నాయి. సినిమాపాటలు ఎంత ప్రచారంలో ఉన్నాయో ఈ ఉత్తరాలు చదివితే మాకు తెలుస్తోంది!

* * *

'చిట్కాలు' అడిగిన కాబోయే కథకులందరికీ పంపించివేశాము. ఈ సంచికలో దీపావళి కథలపోటీ ఒకటి ప్రకటించాము. మాకు రాబోయే కథలసంఖ్య చిట్కాలు అనగాహన చేసుకున్నవారివల్ల ఎక్కువ అవుతుందేమో చూడాలి!

* * *

## లోకంపోకడ



"రాజన్‌బాబుగారూ! తమరు చెప్పింది క్షేమంగా ఉంది. ఇతరులు చేసినా చెయ్యకపోయినా భారతదేశం తనకుతానై ఆయుధ విసర్జనం చెయ్యాలి."

## విషయానుక్రమణిక



పేదవారు
రైతులు
కార్మికులు
యువజనులు
కాంగ్రెసువాదులు
విద్యార్థులు
అల్పసంఖ్యాకులు
పెద్ద మనుష్యులు




పాకిస్తాన్ కు అమెరికా విమానాల సరఫరా
భారతీయుల సందేహాలు
క్రియ




ఎం. ఐ జీ.ల కొనుగోలు
ప్రతిక్రియ




అబ్బబ్బ! ప్రాణం విసిగి పోతోంది. ఉపనాయకుడు ఎవరైతే నేం కనుక!



ఐరోపా సమిష్టి విపణిపై భారతప్రభుత్వంతో చర్చించడానికి వచ్చిన బ్రిటిష్ కామన్వెల్త్ మంత్రి శ్రీ డంకన్ శాండీస్‌కు ఢిల్లీ విమానాశ్రయంలో విదేశీవ్యవహారాల సహాయమంత్రి శ్రీమతి లక్ష్మీమీనన్ స్వాగతం చెప్పారు.

# మంత్రివర్గం స్థితిగతులపై ప్రధాని వ్యాఖ్య: ఉపనాయకుని ఎన్నిక వివాదానికి అంత్యక్రియలు

## శ్రీ కృష్ణ

జబ్బుపడి కోలుకున్న తరవాత తొలిసారిగా ప్రధానమంత్రి గతవారం పత్రికావిలేఖరులసమావేశంలో మాట్లాడారు. ఆయన బుద్ధి నైశిత్యం యథాప్రకారంగా ఉంది. కోపంకూడా వెనకటిమాదిరిగానేవుంది. ఉదాహరణకు 'నెహ్రూ తరవాత ఎవరు?' అన్న ప్రశ్నవచ్చినప్పుడు, ఆ ప్రశ్నకు కాలం దోషం పట్టిందని ప్రధానమంత్రి ప్రకటించారు. ఈ ప్రశ్నకు సమాధానం తెలుసుకుందామని ఇంతకాలం వేచివున్నవారు ఇప్పుడు సహనం కోల్పోయి, తమను రిటైరు కమ్మంటున్నారని శ్రీ నెహ్రూ చమత్కరించారు.

ఆ తరువాత పార్లమెంటులో మామూలు ప్రకారం శ్రీ నెహ్రూ, శ్రీయుతులు నాథ్ పాయ్, విష్ణుకామత్, హేమ్‌బారువాలతో చైనా వ్యవహారంపై వాగ్యుద్ధం జరిపారు.

తమ మంత్రివర్గంలో సిద్ధాంత సంబంధమైన అభిప్రాయభేదాలు ఉన్నవని ప్రధానమంత్రి అంగీకరించారు. అయితే వారు వామపక్షీయులనీ, వీరు మితవాదులనీ పేర్లుపెట్టడం సబబుకాదనీ, అది పాశ్చాత్యసంప్రదాయానికి చెందిన మాటలనీ చెప్పారు. ఆ మాటకువస్తే కాంగ్రెసు సంస్థలోనే సిద్ధాంత సంబంధమైన సంఘర్షణలు గర్భితంగా ఉన్నవన్నారు. ప్రధానమంత్రి తెల్పిన విషయాలను మరోవిధంగా చెప్పాలంటే మంత్రివర్గం సుసంఘటితమైన వ్యవస్థకాదనీ, సిద్ధాంతరీత్యా కుమ్ములాడుకునే భిన్నవర్గాలకూటమి అనీ స్పష్టమవుతోంది. కాంగ్రెసు సంస్థ అతుకుల బొంత వంటిదని ప్రధానమంత్రి తేల్చేశారు.

వెనుక ఒకప్పుడు నాగపూర్ కాంగ్రెసుతీర్మానాల ప్రసక్తి వచ్చినప్పుడు చేసిన ప్రకటనలకు, ఇప్పుడు చెబుతున్నదానికి పొంతన కుదరటంలేదు. ఆ తీర్మానాలను ఆమోదించనివారికి కాంగ్రెసులో స్థానంలేదని అప్పట్లో అన్నారు. కాంగ్రెసు సభ్యులందర్నీ ఒక తాడుమీద నడిపించాలనుకోటమే ఇట్లా అనటంలో అంతరార్థం. అయితే నాగపూర్ తీర్మానాలను వ్యతిరేకించినవారు కాంగ్రెసు సంస్థనుంచి ఎలాగూ విడిపోలేదు కాబట్టి, ఇప్పుడు ప్రధానమంత్రి చేస్తున్న వాదం రుజువైందనే అనుకోవాలి.

* * *

కాంగ్రెసు పార్లమెంటరీపార్టీ ఉపనాయకుల ఎన్నిక వ్యవహారంలో తలెత్తిన వివాదానికి ఈవారం అధికారరీత్యా అంత్యక్రియలు జరిగాయి. మంత్రిపదవులలోలేని ఇద్దరుసభ్యులు—ఒకరు రాజ్యసభకు మరొకరు లోకసభకు—ఉపనాయకులుగా ఎన్నిక అవుతున్నారు. వారు చెయ్యవలసిన పనల్లా నాయకుని పరోక్షంలో పార్టీసమావేశాలకు అధ్యక్షత వహించటమే. మంత్రులుకారుకాబట్టి వారికి ప్రభుత్వంతో ఏ విధమైన సంబంధం ఉండదు. ఇహ మంత్రివర్గ సమావేశాలమాట. ఏ కారణంవల్లనైనా ప్రధానమంత్రి ఈ సమావేశాలకు రాలేకపోతే, సీనియర్ మంత్రి అధ్యక్షత వహిస్తారు. సీనియర్ మంత్రి ఎవరు? అన్న విషయమై మళ్ళీ వివాదానికి ఆస్కారం లేకుండా ప్రధానమంత్రి ఆర్థికమంత్రిపేరు చెప్పారు.

ఈ ఉదంతాన్నంతటినీ పరికించిచూస్తే, ఇది శ్రీ కృష్ణమీనన్ వర్గానికి కలిగిన పరాజయంగా కనిపిస్తుంది. వీరే ఈ వివాదాన్ని లేవదీశారు. శ్రీ మొరార్జీ ప్రతిఘటించారు. ఉపనాయకుడు అన్న పేరు లేకపోయినా, ప్రధానమంత్రి విదేశాలలో ఉన్నప్పుడు ఆయన తరఫున ఆర్థికమంత్రే వ్యవహరిస్తారు.

* * *

ప్రధానమంత్రి ఇటీవల పత్రికా విలేఖరుల సమావేశంలో ప్రసంగించినప్పుడు హిందీ సామ్రాజ్యవాదులకు మంచి చురకవేశారు. ఆకాశవాణి వాడుతున్న హిందీ భాషను సంస్కరిస్తున్నట్లు ఆయన వెల్లడించారు.

ఇది ఇట్లా ఉండగా 1965 తరువాత కూడా ఇంగ్లీషు ప్రాధాన్యాన్ని నిల్పేందుకు పార్లమెంటులో ఒక బిల్లు ప్రవేశపెడుతున్నామని దేశీయాంగమంత్రి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి ప్రకటించారు. ప్రధానమంత్రి చాలా నిర్మొహమాటంగాను, ఖండితంగాను మాట్లాడారు. అభివృద్ధిపథంలో ఏ అంతరాయంవచ్చినా నిర్మూలించటంతప్పదన్నారు.

* * *

కార్మికమంత్రి శ్రీ గుల్జారీలాల్‌నందా ఎప్పుడూ నూతనోత్సాహం కలిగిస్తూనే ఉంటారు. అఖిలభారత కార్మిక కాంగ్రెసు వార్షిక సమావేశంలో ప్రసంగిస్తూ, వారు ఒక కొత్త సిద్ధాంతం ప్రతిపాదించారు. అసంతృప్తిపొందిన కార్మికులు ఎవర్నైనా సరే పనిమానుకోకుండానే సమ్మె ప్రారంభించినట్లు తమకు తంతిద్వారా తెలియజేయాలన్నారు. ఇహనేం సచివాలయ ఉద్యోగులు కాఫీ సేవిస్తూనే తాము పని చేస్తున్నట్లుగా పరిగణించవలసిందని తమ శాఖల కార్యదర్శులను కోరవచ్చు!

కొందరు తమతప్పులేవో తెలుసుకుని తగిన పాఠం నేర్చుకుంటారు. మరికొందరు ఇతరుల తప్పులు తెలుసుకుని నేర్చుకుంటారు. అసలు ఏవిధంగానూ నేర్చుకోవడానికి ఇష్టపడనివారు వీరందరిలోనూ ఘటికులు. ఇక్కడ కొంత వివరిస్తాను. రెండుఏళ్ళక్రితం చైనాలో ఉక్కుఉత్పత్తి జోరుగా సాగుతున్నది. పెద్దపెద్ద పెట్టుబడులు పెట్టి ఉక్కుఉత్పత్తి చేసే విధానం పశ్చిమరాజ్యాలకు సరిపడ్డా, ఆసి

—64వ పేజీ చూడండి

శ్రీ కృష్ణగారు యూరప్ పర్యటనకు వెళ్ళినందువల్ల కొంతకాలం పాటు 'న్యూఢిల్లీ లేఖ' ఉండదు.

శ్రీర్థయాత్రకు పోదామంటే ఏ తిరుపతో, కంచో, కాశాస్త్రో అనుకున్నాగాని,—ఇక్కడికొచ్చావేం—అంటావా?—

ఒరే — నాకు ఈ ఊరిమీదే గురి! — ఈ ఊరు, అనాదిగా, బావన్నపల్లి .... ఇప్పుడు అచ్చమ్మపేట!—

మా మేనత్త—అంటే—మేనమామ భార్య—ఆ అచ్చమ్మగారు, ఆవిడ పుట్టి పెరిగిన ఊరు: మా మేనమామ జోలెపట్టిన ఊరు:

మా ఊరినుంచి ఈ ఊరొచ్చి,—ఇక్కడనుంచే నేను పట్నం పారిపోయొచ్చేసింది!—

అంటే ఊరు తరిమికొట్టలేదు — మానాన్న ఇక్కడకూ తరుముకొచ్చి హడలకొట్టాడు. మనం ఉడాయించాము:

మా అమ్మ పుట్టిల్లూ ఈ ఊరే, మాతామహులు వృత్తిలేక ఉపాదానం చేసుకునేవాడు! ఒక్క కొడుకు, ఒక్క కూతురు: ఆ కూతుర్ని అంటే మా అమ్మను .... తనలాగానే సీతారామాభ్యాంనమః అనుకుంటూ జీవిస్తూన్న మా నాయనకు కాళ్ళుగడిగి ధారపోశాడు: మా నాన్న, — ఉన్నంతలో ప్రయోజకుడే — నోటిమంచితనాన, —అందరినీ అయ్యా బాబూ అంటూ, — అలాగే ఆలక్ష్యంకొద్దీ, నలుగురూ తలో తృణమూ ఇవ్వగా, — ఆ పరకలు పోగుచేసి,—యజ్ఞంచేశాడు — పెద్దపెట్టునే—కాని, బ్రతకనేర్చినవాడు కాకపోవడంతో కాస్త కూస్త వెనకేసుకోలేదు: ఆ మర్నాటినుంచి, తానూ తన రాగిచెంబూ,....యథాప్రకారమే:

మానాన్న చూశావ్ .... బయట పరమ సాధువే కాని — ఇంట ఫాలాక్షుడు: ఎవరిమీదా ఒ కోపం కాదు,—ఎందుకో ఒకందుకని కాదు .... ఎప్పుడూ

—57వ పేజీ చూడండి



# ప్రపంచ ప్రముఖులు-4

బెర్ట్రాండ్ రస్సెల్ గొప్ప తత్వశాస్త్రజ్ఞుడు. గణితతత్వశాస్త్రంలో ఈయన చేసిన కృషికి తగిన కీర్తి లభించింది. కాని రస్సెల్ ఏమీ పట్టించుకోని 'వేదాంతి' మాత్రం కాదు. ఎంత మేధావియో అంత గొప్పవ్యక్తి కూడా. చిన్నతనంలోనే తను "ఎర్ల్" బిరుదు వదులుకున్నారు. శాంతి ఉద్యమంలో పాల్గొని మొదటి ప్రపంచ యుద్ధం సందర్భంలో కారాగృహానికి వెళ్ళారు.

ఎవరో మహామేధావులకు తప్ప అర్థం కాని సమస్యలలో మునిగిపోక మానవులకు నిత్యజీవితంలో సంభవించే విషయాలు మొదటినుంచీ నిర్భయంగా చెప్తూనే వచ్చారు. నేడు అణ్వస్త్రాలవల్ల మానవజాతి నశించే ప్రమాదం ఉన్నప్పుడు ఈ తొంభై ఏళ్ళ మనిషి అణ్వస్త్రాలను నిషేధించాలని చేసిన 'అలజడికి' జైలుకి వెళ్ళారు.

అణ్వస్త్రాలు నిషేధించాలని వచ్చేవారందరూ రస్సెల్ విధానాలను అంగీకరించడంలేదు. అంతర్జాతీయంగా ఒప్పందం కుదరనిదే పశ్చిమరాజ్యాలనే ఎక్కువగా విమర్శించే ఉద్యమాలను రస్సెల్ బలపరచడం అంత న్యాయం కాదనిపించవచ్చు. [రెండవ ప్రపంచ యుద్ధం అయిపోయిన తర్వాత రష్యా అణ్వస్త్ర పరిశోధనలు ఒక అంతర్జాతీయ సంస్థ ఆధ్వర్యంకింద జరగటానికి ఒప్పుకోనప్పుడు రస్సెల్ ఆ దేశాన్ని 'ఏటంబాంబు'లతో బెదిరించాలని సలహా ఇచ్చారు; యుద్ధం ముందు 'నాజీ'లను మర్యాదచేస్తే బాగుపడతారని ఈయన భావించినట్లు తెలుస్తుంది!] కాని రస్సెల్ చెప్పినదానిలో ఒకటి స్ఫురిస్తుంది – కమ్యూనిస్టులు చెడ్డవారు కాబట్టి వారితో సంప్రదించటం తప్పు, అనే వాదం దారుణమయినదని ప్రచ్ఛన్న యుద్ధ రాజకీయాలలో మాత్రం ఈయన వాదం మరుగుపడిపోతూ ఉంటుంది.

ఇటువంటి చిన్న చిన్న వివరాల మాట అటుంచి, జీవితమంతా తోటి మానవుల సేవకే ధారపోసిన ఈ మహామేధావి తన ఆఖరిదశలో కూడా ఇంత ఉత్సాహంగా ఒక ఉద్యమంలో పాల్గొనడం మరికొందరు ప్రపంచ ప్రముఖులు గమనించతగ్గ విషయం.



# సినిమా వార్తలు

## ఖైదీ కన్నయ్య

విరలాచార్య దర్శకత్వంలో తయారైన ఈ చిత్రం ఇప్పుడు నూరురోజులకుపైగా ఆడుతోంది అతిసామాన్యమైన నేరస్థ కార్యకలాపాలు ఆధారంగా తీసిన చిత్రం. వాస్తవానికి కథలో చెప్పుకోదగ్గ వినూత్నత గోచరించదు. అయినా చిత్రం ఇన్ని రోజులకుపైగా ఆడుతోందంటే చిత్ర దర్శకత్వం లోనూ, పాత్రపోషణలోను గల విశిష్టతే అని చెప్పుకోవాలి. బహుశా ఈ చిత్రంతో విఠలాచార్యను శతదినోత్సవపు చిత్ర దర్శకులలో చేర్చవచ్చు. అసలు పెట్టుబడికి నష్టంలేనివ్యాపారం ఆయనది. అందువల్ల స్థూలదృష్టితోచూస్తే చిత్రాలు పరాజయం పొందినట్లనిపించినా, 'విఠల్ దర్శకత్వపు చిత్రాల నిర్మాతలు వెనువెంటనే చిత్రాలు నిర్మించి తగు లాభాలుపొంది, పలువురు క్రొత్తవారిని చిత్రరంగంలోకి అన్ని విభాగాల్లోను నిలపగలుగుతున్నారు.

కొత్తవారంటే జ్ఞాపకంవచ్చింది. అగ్రస్థాయి' అన్నమాటకు కొంచెం ఇటుగాఉన్న చాలామంది నటీనటులకు పట్టుకొమ్మగా నిలిచి వారిని పదికాలాల పాటు రంగంలో నిలిపిన ఘనత ( 'మారుపేరు ~శాసేవ') విఠలాచార్యలాంటి వ్యక్తికే దక్కుతుంది.

ఈ చిత్ర నాయకుడు ఎన్నో శత దినోత్సవపు చిత్రాల్లో పాల్గొన్నా, శతదినోత్సవపు చిత్ర నాయకుడుగా పరిగణనకు వచ్చేది ఖైదీకన్నయ్యతోటే. అలాగే ఈ చిత్రంలో వివిధ సాంకేతిక విభాగాల్లో పనిచేసిన వ్యక్తుల్లో చాలామందికి ఊతం ఇవ్వటానికి పుస్కారమైంది కూడా ఖైదీ కన్నయ్యే అవుతోంది.

భారీఎత్తున చిత్ర నిర్మాణం తలపెట్టి పూర్తిచేయలేక నిర్మాతలు అడపా దడపా స్వగ్రామంవెళ్ళి పోవల్సివస్తున్న ఈ రోజుల్లో అసలు పెట్టుబడికి నష్టం కలిగించకుండా, కాస్తో కూస్తో లాభాలతో పదిమంది పొట్టనింపుతూ చిత్రాలు తీయటం కూడా వ్యాపార కీలకమేమో......

## కొత్త చిత్రం

పై చిత్రాన్ని నిర్మించిన రాజ్యలక్ష్మీ సంస్థ ఇంకో భారీ సాంఘిక చిత్రాన్ని నిర్మిస్తున్నది. 'బాటసారి' దర్శకుడు రామకృష్ణ చూపిన బాటల్లో తయారయ్యే ఈ చిత్రంలో యన్. టి. రామారావు కాంతారావు, సావిత్రి ఇంకా పలువురు పాల్గొంటున్నారు.

తమిళంలో ప్రజామోదంపొందిన అతి భారీ విషాదాంత చిత్రం "పాశమలర్" అనుసరణగా తయారవుతున్న ఈ చిత్రానికి 'బుడుగు' నవలా రచయిత, ముళ్ళపూడి వెంకటరమణ మాటలు వ్రాస్తున్నారు.

పైవి రెండు మంచి చిత్రాలే. అయితే వాస్తవికజగత్తు, మంచి అతకని బ్రతుకులు, మంచి చెడులు సమపాళంగానో చెడు ఓ పాలు ఎక్కువగానో ఉంటేగాని మంచికి మన్నన ఉండదు. పట్నవాతావరణావు, దూరదేశాల చదువులవల్ల కలిగిన వ్యామోహాల చెడును గ్రామీణ, దేశీయ, సాంప్రదాయక వాతావరణంలోని మంచిని మిళాయించి మంచి గొప్పతనాన్ని కళ్లకు కట్టినట్లు చూపించేందుకు ప్రయత్నిస్తున్న చిత్రమే ...

## అప్పగింతలు

యం. యం. ప్రొడక్షన్స్‌పేరిట తయారయ్యే ఈ 'మంచిచెడు సమపాళ్ళ చిత్రణంలో' జగ్గయ్య, జమున, రమణమూర్తి, రాజసులోచన, రమణారెడ్డి, కె. వి. యస్. శర్మ మొదలగువారు నటిస్తున్నారు. విద్య, వివేకమే గాకుండా సుహృద్భావం, సత్ప్రవర్తన కూడా ఉన్నప్పుడే జీవితం వన్నె కెక్కుతుందనే నీతి ఇతివృత్తంగాగల ఈచిత్రం ఈనెలాఖరులోగా విడుదల కాగలదని తెలుస్తోంది.

ఇటీవల శత దినోత్సవం చేసుకున్న 'ఆరాధన' చిత్రం దర్శకుడు వి. మధుసూధనరావు దర్శకత్వపు బాటలో నడిచే ఈ చిత్రంలో 'అమారాధ' (రాధిక పేరు మార్చుకున్నది) అనే నటిని కొత్తగా పరిచయం చేస్తున్నారు. నిర్మాత: శ్రీరామమూర్తి.

* * *

ఇంతవరకు చూచినవన్ని కొత్త సీసాలోని పాత సారాలే. కాకపోతే—నీరాలు. కథ, కథనంలో క్రొత్త పోకడలు సృష్టిగల చిత్రం రోనో ఫిలింస్‌వారు నిర్మించే ఈ చిత్రాన్ని వచ్చేనెల్లో విడుదల చేయాలని నిర్మాతల అభిలాష.

## తల్లీ బిడ్డలు

వస్తుతః కొత్త పోకడలు, భావాలుగల యువ పాత్రికేయుడు, కథా రచయిత యడవల్లి లక్ష్మీనారాయణ నిర్మిస్తున్న ఈ చిత్రంలో బాలయ్య, కృష్ణకుమారి, హరనాథ్, రాజశ్రీ, లింగమూర్తి, నాగయ్య, హేమలత, మీనాకుమారి, డా. శివరామకృష్ణయ్య, పేకేటి శివరాం పాల్గొంటున్నారు. దర్శకుడు: పి. యస్. శ్రీనివాసరావు, ఛాయ: కె. యస్. ప్రసాద్ సంగీతం: బి. శంకరరావు.



దర్శకుడు శేషగిరిరావు వేసిన విట్టుకు దేవిక నవ్వుతున్నది— 'మువ్వానేనా' సెట్టుమీద! చూస్తున్నది కెమెరామన్ జాగీర్దార్, సహాయదర్శకుడు వెంకటరావు. ఫోటో: రూప.

## కొత్త చిత్రం

అసలు చిత్రం విడుదలయింతర్వాత వెంటనే ఇంకో చిత్రాన్ని నిర్మించే ప్రయత్నాలే అరుదుగా ఉంటున్న ఈ రోజుల్లో తను నిర్మించిన చిత్రాన్ని విడుదలయ్యేలోగానే ఇంకో చిత్ర నిర్మాణానికి పూనుకోవటం సాహసమే అనిపించుకుంటుంది. అలాంటి సాహసికుడే రోనో ఫిలింస్ నిర్మాత యడవల్లి లక్ష్మీనారాయణ. తల్లీ—బిడ్డలు చిత్రం వచ్చేమాసంలో విడుదల చేసేలోగా కొత్త చిత్రం పని కొంత కొనసాగించాలని "అమ్మా—నాన్న" చిత్రం ముహూర్తాన్ని జరిపించి నిర్మాణాని కుపక్రమించారు.

—49వ పేజీ చూడండి

# కథ కాని కథ

## 'బంగారం' గొలుసా ?

### (మొదటి బహుమతి)

మా యింటి కెదురుగా సావిత్రమ్మగారని ఒకావిడ ఉన్నారు. ఆవిడను చిన్నప్పటినుండీ వాళ్ళు వాళ్ళందరూ బంగారం గారని పిలుస్తూ ఉండేవారు. అందుచేత మా ఊళ్ళో చాలామంది ఆవిడను బంగారం గారనే పిలుస్తూ ఉండడం అలవాటైపోయింది. బంగారంగారి వదినగారూ మేనకోడలు నాలుగు రోజులై మచిలీపట్నంనుండి వచ్చేరు. ఆ అమ్మాయికీ, నాకు చాలా స్నేహము. ఆమె ఒక నెక్లెస్ కొనుక్కొని సరదాగా పెట్టుకుంటున్నది. ఓరోజున మేమందరమూ కలసి ఓభాగ్యవంతుల ఇంటికి పేరంటానికి వెళ్లేము. ఆ యిల్లాలు మమ్మల్ని కూర్చోమంది. కూర్చున్నాము. తర్వాత ఆ అమ్మాయి నెక్లెస్ చూచి "ఇది బంగారందేనా" అని అడిగింది. దానికి ఆమె "బంగారంది కాదు, నాది" అని జవాబు చెప్పింది. ఆవిడ మళ్లీ నోరెత్తలేదు. ఆ అమ్మాయి సమయస్ఫూర్తికి పేరంటానికి వచ్చినవాళ్లంతా ఆశ్చర్యపోయారు "బంగారం" గారితో సహా.

చీమలపాటి సుబ్బ కామేశ్వరి (ముంగండ)

*   *   *

## తెలిసీ - తెలియక

### (రెండవ బహుమతి)

శర్మగారు చాలా కమిటీలలో మెంబరవటం మూలాన తరచు మీటింగులకు హాజరయ్యేవారు. మీటింగున్నప్పుడల్లా ఇంటికి ఆలస్యంగా వస్తానని మా స్నేహితుడు రామారావును ఇంటిదగ్గర చెప్పమనేవాడు.

రామారావు వాళ్లింటికి వెళ్ళి ఎలా పిలావాలో తెలియక ముందు 'శర్మగారూ'. అని పిలిచేవాడు. వెంటనే వాళ్లింట్లోంచి "శర్మగారు లేరండీ!" అని సమాధానం వచ్చేది. అప్పుడు రామారావు "అది కాదండీ" అని ఆయన ఇంటికి ఆలస్యంగా వస్తానని చెప్పమన్నారండీ" అనేవాడు. అదివిని ఆవిడ మొదలు కొంచం విస్తుపోయి, మెల్లిగా నవ్వుకునేది. తర్వాత, తర్వాత ఆవిడ ఇతన్ని చూడగానే సంగతేమిటో గ్రహించేసి ఇంట్లో లేరని చెప్పడం మానివేసింది.

టి. యస్. రాంబాబు (విశాఖపట్నం)

*   *   *

## ఎన్నికల వినోదం

### (రెండవ బహుమతి)

మొన్న ఎలక్షను సమయములో నేను మా బావగారి వూరు వెళ్లాను. అది చాలా చిన్న వూరు. కాని అక్కడకూడా ఎలక్షను ప్రచారం జోరుగానే సాగుతోంది. ఆ రోజు ఏదో పార్టీవారు అక్కడ మీటింగుపెట్టుకున్నారు. ఆ మీటింగుకు ఆపార్టీలో పేరున్న నాయకుడొకాయన కూడ వస్తున్నాడు. కనుక మా బావగారు సరదాగా మీటింగుకు రమ్మంటే నేను కూడా అక్కడకు వెళ్లాను.

అది పల్లెటూరు కాబట్టీ ఏమంత జనం రాలేదు. వచ్చిన జనం కూడా ఏమి చదువుకున్న వారుకూడ కాదు. ఇంతలో ఆ పార్టీ కార్యకర్త ఒకాయనవచ్చి శ్రోతల నుద్దేశించి ఇట్లన్నాడు' మన నాయకులు వారు వేదికమీదకు వచ్చేటప్పటికి "మన దేశప్రశస్తి" అని నేను అనేటప్పటికి మీరు 'పెరగాలి' అనీ. నేను 'అధికధరలు' అనేటప్పటికి మీరు 'తరగాలి' అనీ అనాలని చెప్పి వారిచే రెండు మూడు సార్లు కష్టపడి అనిపించాడు.

ఈలోపల అప్పుడే కారు ఆ పార్టీ నాయకుడు వేదిక మీదకు రావడంతో ఆ కార్యకర్త కంగారు పడి 'మన దేశ ప్రశస్తి' అని అనకుండానే మొదటే 'అధికధరలు' అనీ అని అన్నాడు. దానితో శ్రోతలందరు ఒక్కసారిగా 'పెరగాలి' అన్నారు. ఆ కార్యకర్త మ్రాన్పడిపోయి ఇక రెండోమాటనకుండా వేదిక దిగిపోయేడు.

కవల వరహాలరావు (పాయకరావుపేట)

★

# సరాగమాల

### వి ఎ కె రంగారావు

రేడియోలో లలిత సంగీతకార్యక్రమాలలో ఎన్నో మంచి పాటలు వస్తూ ఉంటాయి. ఇవి మరల వినాలంటే శ్రోతలకు ఒకటే మార్గం. "శ్రోతలు కోరిన పాటలు" కార్యక్రమానికి వ్రాయటం. ఈ కార్యక్రమాలలో కూడ సినిమా పాటలకు అంకితమైనవే ఎక్కువ. కేవలం రేడియో పాటలే వేసే శ్రోతలకోరికల కార్యక్రమాలు ఎంతో అరుదుగా గాని ఉండవు.

ఈ పాటలు మరెక్కడా దొరకవు. ఎవరికైనా ఎందుకైనా పనిబడినా, రేడియో స్టేషనుకి వెళ్ళి వినటం వీలుకాదు. ఆపాటలు రికార్డుచేసి ఒక్కొక్క కాపీఅయినా రచయితకు, సంగీత దర్శకునికి, గాయకునికి ఇస్తే గుర్తుకోసమైనా ఉంటాయని అరుద్రగారన్నారు. దీని కొక చిన్న చిక్కు. రేడియో స్టేషన్‌లో రికార్డు చేయబడిన పాటలు, గ్రామఫోను రికార్డులు రికార్డు చేయబడే పద్ధతిలో చేయబడవు. అవి రేడియోలోగాని, బయటగాని పదిసార్లకంటే వేయడానికి వీలుండదు. వేరేకాపీలు తీయటం అసలే సాధ్యంకాదు. అటువంటప్పుడు పాటను సృష్టించినముగ్గురికి తలా ఒక కాపీ యెలా పంచిపెడతారు?

రేడియో పాటలకు, సినిమా పాటలకు ముఖ్యమైన తేడా ఒక్కటే. రేడియో పాటలకు వాద్యగోష్ఠి కొంచెం తక్కువగా ఉంటుంది కాబట్టి ఆశాఖలో మాత్రం యేమాత్రం వెలితి కనపడవచ్చుగాని సంగీత సాహిత్యాలదృష్ట్యా విలువైనవే అయిఉంటాయి.

భానుమతిపాడిన అన్నమాచార్యులవారికృతి "విన్నపాలు వినవలె వింత వింతలు, పగడంపు దోమతెరసై కెత్తవేలయ్యా' అనే మేలుకొలుపు, బాలసరస్వతి పాడిన రజనీ రచన "చిటారు కొమ్మన, హాయిగా తీయగ కోయిల పాడినదే" అను భావగీతం, మాధవపెద్ది సత్యం పాడిన ఆరుద్ర సాహిత్యం "పదుచుదనపు రైలుబండి" అనే సరదాపాట ఎంత మధురంగా ఉంటాయి? ఆరుద్ర రచనే మరొకపాట "నీ చిరునామా యేమి, నిజము తెలుపుమా స్వామి" అన్నది ఘంటసాల పాడినది ఆమధ్యన విన్నాను. మళ్లీ వినాలనిపించింది. కాని ఎలా సాధ్యం?

దాదాపు పదేళ్ల క్రిందట పనిలేక రేడియో ముందు కూర్చొని ముల్లు తిప్పుతుండగా ఒక పాటలో చివరి రెండు చరణాలు వినిపించినవి. పల్లవిలోనో, అనుపల్లవిలోనో "మనుజాని మనుగడ" అని ఉంటుంది. ఈ యుగళగీతం పాడిన మగకంఠం మళ్లీకదని గుర్తు. స్త్రీకంఠం కోమలదో, సరళదో. మొత్తానికి పాటమాత్రం హృదయానికి హత్తుకుపోయింది. అప్పుడప్పుడు నిర్మానుష్య ప్రదేశాలలో వాతావరణం బరువుగా ఉన్నపుడు ఆ పాట మనస్సులో లీలగా, అవ్యక్త మధురవేధగా మెదులుతుంది.

ఈ పాటలు అందరికీ అందుబాటులో ఉండాలంటే ఒకటేమార్గం. రేడియో పాటలు, అన్నీ కాకపోయినా కొన్నైనా యేరి మామూలు గ్రామఫోను రికార్డులుగా విడుదల చేయించటం. దినివలన రేడియో స్టేషన్ ఆదాయం పెరుగుతుంది. దానితో కళాకారులకిచ్చే పారితోషికం తగుమాత్రంగా పెంచవచ్చును. కోరిన శ్రోతల చేతిలో వారి కిష్టమైన పాటల రికార్డులూ ఉంటాయి.

ఇంతకుముందు రేడియోద్వారా ప్రజామోదం పొందిన పాటలు రికార్డులుగా వచ్చేవి. కాని ఇవి రికార్డింగ్ కంపెనీలు స్వతంత్రించి చేసిన రికార్డులు. వీటి లాభనష్టాలతో రేడియో స్టేషన్ కేమీ సంబంధం ఉండేదికాదు. రాజేశ్వరావు విడి రికార్డులు ముమ్మరంగా అమ్ముడుపోతున్న రోజుల్లో, వారు రికార్డులుగా ఇచ్చిన వాటిలో చాలమట్టుకు మొదట రేడియోతో పాడినవే.

మునుపటివారం ఉత్తరాలకు జవాబులు: పిఠాపురంనుంచి వ్రాసిన రాం, ధం అండ్ రత్నంగార్లకు: మంచి పియానో పాటల గురించి వ్రాస్తూ, "ఆరాధన"లోని, "నా హృదయంలో నిదురించే చెలీ" అన్న పాటను విస్మరించడం విచారకరమైన విషయం అని మీరు విమర్శించారు. నా విస్మరణకు కారణం అది బెంగాలీచిత్రం "సాగరిక" ("ఆరాధన")కు మాతృకలోని పియానో పాటకు మక్కికి మక్కి అనుకరణ అవటమే. ఒక వాద్యాన్ని విశిష్టంగా ఉపయోగించారనటానికి వారి స్వంత ప్రతిభ అందు ప్రతిబింబించాలి. అప్పుడే కాదా దాని గురించి విశేషంగా చెప్పుకోవడం జరుగుతుంది? మరొకరి విద్వత్తును అనుకరించడంలో చెప్పుకోదగ్గది ఏముంది!

బర్హాంపూర్ పాఠకులు జయంతి సత్యవతి గార్లకు: బాలసరస్వతి పాడిన "తెలుగు పాపాయి" "ఈ ప్రేమ" ఒక రికార్డు. రెండింటికీ సంగీతం ఎస్. హనుమంతరావుదే అని రికార్డుమీద వుంది. దీనినిచూసి పొరబడింది మీరే! నేను కాదు. ఆరెండు పాటలకు వరసలు, రేడియోకోసం చేసింది రాజేశ్వరావే. అప్పట్లో హనుమంతరావుగారికి సంగీత దర్శకునిగా పేరు లేకపోవటంవలన ఇలాగ రికార్డులపై వారి పేరువేయటం జరిగింది.

సమరపల్లి ఆర్. వేణుగోపాల్‌గారి సందేహం: "పాతాళభైరవి"లో "ప్రేమకోసమై" పాడినది వి. జె. వర్మ. "పెళ్లిచేసిచూడు"లో "పోవమ్మా బలి కావమ్మా" వీరు పాడినదే. మొదటిపాటలో పాడిన కంఠంకాక వెనుక వినిపించింది ఆ చిత్రానికి దర్శకులైన ఘంటసాలగారిదే.

చిత్తూరు విజయకుమార్‌గారికి:—"బాగస్విరి విన్నై" చిత్రానికి సంగీత దర్శకులు మీ రన్నట్లు విశ్వనాధన్ రామ్మూర్తులే. లోగడ తిరుచ్చినుంచి కె. రామలింగంగారు కూడ పై విషయాన్నే తెల్పుతూ వ్రాశారు. విజయకుమార్‌గారు తెలియక అడుగుతున్నాను. నేను వ్రాసే శీర్షికలో సంపాదకులతప్పు ఎందుకు ఉంటుంది? అయితే అచ్చుది లేకపోతే నాది అవుతుందిగాని!

## రికార్డు రివ్యూ

మురిపించేమువ్వలు జిఇ 35276

"నీలిత పాడెద దేవా" అన్నపాటకు తమిళమాతృకయైన "సింగారవేలనె దేవా" దక్షిణ దేశాన్ని ఒక ఊపు ఊపేసింది. పాట సంగీత రచనా విధానం పక్కా కర్ణాట ఫక్కీలోనున్నా ప్రజా బాహుళ్యానికి బాగా నచ్చిందనే చెప్పాలి. ఈ పాట రికార్డు తమిళంలో అయిదువేలకుపైగా అమ్ముడుపోయినవి."

ఈ పాటకు ప్రత్యేకతనిచ్చే అంశాలు చెప్పుకోవాలంటే చాలా ఉన్నవి. మొట్టమొదటిది సంగీత దర్శకులైన సుబ్బయనాయుడు అపారప్రతిభ. ఇంతవరకు నాదస్వరాన్ని మానవకంఠాన్ని మేళవించటానికి ఎవరూ ప్రయత్నించ సాహసించలేదు. అసాధ్యమనే ఉద్దేశంతోనే కావచ్చు. అటువంటి పరిస్థితిలో సుబ్బయ్యనాయుడు ఇటువంటి మహాత్కృష్టి సృష్టి చేశారంటే అది ఒక విశేష వినూత్న ప్రయోగమే అనవచ్చు. ఈ ప్రయోగం యావద్దక్షిణ భారత సినిమా పరిశ్రమ అంతా కలసికట్టుగా గర్వించదగినంత పటిష్టంగావుంది.

ఈపాట ఇంత నిర్దుష్టంగా ఉంటానికి సుబ్బయనాయుడు తీసుకున్న శ్రమ అంతా ఇంతా కాదు. మొదట నాదస్వర విద్వాన్ కారైకురుచ్చి అరుణాచలంతో రికార్డులో వినపడే నాదస్వర భాగాలన్నీ జాగ్రత్తతో రికార్డు చేశారు. తరువాత దీనితోబాటు కంఠాన్ని కలిపి రికార్డు చేయదలిచారు. ఈ శ్రుతిలో శ్రుతి కలిపి పాడగలిగిన కంఠంకోసం మద్రాసు అంతా గాలించారు. మనకు లేరనుకొని బొంబాయి వెళ్ళారు. అక్కడా ఎవరూ దొరకలేదు. తిరిగి మద్రాస్ వచ్చి జానకిచేత పాడించారు. అస్థాయి శ్రుతి వారు అవలీలగా అందుకున్నారుగాని, పాడటంలో మరొక చిక్కువచ్చింది. స్త్రీ పాడగా ఆవే స్వరాలు నాదస్వరంతో పలికించినట్లుకదా రికార్డులోఉంది? కాని నాదస్వరమే ముందు రికార్డు చేశారు. సంగతికి సంగతికీ మధ్యన ఉంచిన జాగాలలో జానకివచ్చే (నాదస్వర) సంగతిలోనున్న స్వరాలను అనాలి. ఈ సమస్యయమే తికమకపెట్టి చాల కాలాన్ని తీసుకుంది.

ఇక అసలుపాట సంగతికి వద్దాము. రాగం, రసికహృదయాంతరాళంలోకి దారి, యువ హృదయ నావలకు కావేరి అయిన అభేరి. సినిమాపరంగా చెప్పుకోవాలంటే భీంప్లాస్ అనీ కూడా అంటారు. సుబ్బయనాయుడు ఈ రాగాన్ని విశిష్టమైన పద్ధతిలో "నలుగురికీ తెలిసిన "నగుమోము"కి యేమాత్రం పోలిక సామాన్యులకు కనిపించకుండా చేశారు. దీనిలోను అమర్చిన స్వర మాలలలోను, ఘటవాద్య దరువులలోను, ఒకటేమిటి పాట ప్రత్యంగములోనూ వారి ప్రజ్ఞ దేదీప్యమానంగా ప్రజ్వరిల్లుతున్నది.

౨౨-వ పేజీ చూడండి




## ఒంటరి ప్రయాణాలు

"ఒంటరిప్రయాణాలు" వ్యాసాన్ని శశికళ గారు, ఏ ఉద్దేశంతో వ్రాసారో అర్థంకాలేదు. వనితలకెప్పుడూ, అత్తా కోడళ్ల గురించీ, సొంత డబ్బా వాయించుకోవడంతప్ప ఇంకేమీ వ్రాయ డం చేతకాదేమో!

ఆర్. సత్యవతి ( పాలకొల్లు )

* * *

ఈ రోజుల్లో ఒంటరిగా ప్రయాణంచేసే స్త్రీలు ఎన్ని అవస్థలకు గురికావలసివస్తుందో ఈ వ్యాసంద్వారా చక్కగా వివరించారు. వ్యాసంలో ఒకలోపం కనిపించింది. రైల్వే ఉద్యోగులు తప్పుడు సమాధానం ఇచ్చారని వ్రాశారు. ఇది సమంజస మైనదికాదు. రైల్వే ఉద్యోగులు ఎప్పుడూ అలా చేయరు. శశికళగారివంటి చదువుకున్నవారే, అలాంటి అవస్థలకు లోనైతే ఇక చదువురాని పల్లెటూరి వారిసంగతి వేరే చెప్పాలా!

ఈ విషయమై ప్రభుత్వము తగినచర్య తీసుకుంటే ఎంతో బావుంటుంది.

సమ్మారు స్వరాజ్యలక్ష్మి ( గూడవ్వూరు )

* * *

శశికళగారు ఒంటరి ప్రయాణాలలోగల బాధలను, ఎదురయ్యేనే పరిస్థితులనూ— చక్కగా వర్ణించారు. ఈరోజుల్లో ఆడపిల్లలు ఒంటరిగా యెచ్చటికి బయలుదేరినా రకరకాలమాటలు, అనేక పోజులూ ఎదురవుతున్నయ్! రచయిత్రిగారు తెల్సి నట్టు ప్రక్కనే భర్తో, లేక అన్నయ్యో వుంటే ఈ పోజుల పోకిరీరాయళ్లంతా అతి మర్యాదగా తలైనా ఎత్తకుండా కూర్చుంటారు. ప్లాట్ ఫారంమీద బండ్ల రాకపోకలగురించి అడిగితే తెలియని ట్రైమ్సు చెప్పిన ఉద్యోగులగురించి రచయిత్రి చెప్పారు. బాగేనే వుంది. మరియొక రకం, వింతమనుష్య లున్నారు. మనం తలతిప్పు కొని కూర్చున్నా "ఏ ఊరు వెడతారండీ? అయ్యో ఆ బండి వెళ్లేసరికి రాత్రి పన్నెండవుతుంది. పాపం ఒక్కరే బయల్దేరినట్టుంది." ఇలా సాగిపోతుంది వారి భాష. ఇలా పిలవని పేరంటానికొచ్చేవారి గురించికూడా వ్రాసినట్టయితే ఇంకా బావుండేది.

కుమారి. ఎస్. ప్రియంవద ( నాగార్జునసాగర్ )

* * *

రైల్వే టైమ్‌టేబిల్సు అమ్ముతారని బహుశ వారికి తెలియదేమో?! 'గుంటకల్'నుంచి 'రేణి గుంట'కు పోయే బండి ఎన్నిగంటలకు ఉందని అసిస్టెంటు స్టేషనుమాస్టర్ని అడుగవలసిన లేకుండా, ఈ టైంటేబిల్సు అవసరపడి ఉండేవికదా?

కుమారి సువర్ణ సరస్వతి ( రౌర్కెలా )

* * *

ఆవిడ చెప్పినదాంట్లో అతిశయోక్తిలేదు. చాలా మంది మగవారికి ఆడవారు బాగుగా తయారై ఒంటరిగా వెళ్తున్నప్పు డల్లరిపెట్టడం, వారి దగ్గర పోజులు కొట్టడం మొదలైన పనులు చెయ్యడం సరదాగా వుంటుందనే భావంతో చేస్తారు. ఇలాంటిపనులు చేస్తున్న మగవారిని చూస్తుంటే అసహ్యంవేస్తుంది. నిజమే, ఆడువారు ఒంటరిగా ప్రయాణంచేసేటప్పుడు బహుజాగ్రత్తగా ప్రయా ణం చెయ్యాలి.

నాకు తెలిసిన ఒకామె ఇలాగే ఒంటరిగా ఒక సారి ప్రయాణం చేస్తోందట. ఆమె నల్లరిపాలు చెయ్యడానికి నలుగురు కుర్రకారు పోజులు విసర డం మొదలెట్టేరట. ఆమె సామాను పిల్లలు చూసి ఏ దూరప్రదేశమో అయి ఉంటుందని ఆకుర్రకా రనుకున్నారట. కాని ఈవిడ పక్క స్టేషనులో దిగిపోయిందట. ఇదంతా ఆవిడ ఒక కథలా చెప్పడం మొదలెట్టింది. ఇకమీదటకూడా శ్రీ శశికళగారు— ఆమెను ఏవిధంగా సంబోధించాలో తెలియడంలేదు— ఇలాంటి వ్యాసాలు రాస్తారని ఆశిస్తున్నాను.

జయంతి రామలక్ష్మి ( విజయనగరం )

* * *

మన తెలుగుదేశంలోనే "శశికళ"గారిక్కి తన ఒంటరి ప్రయాణము అంత చికాకుగా ఉంటే భాషకాని భాషగల ఈ పరరాష్ట్రంలో మా ప్రయాణాల మాటేమిటి?

పంచాలి శుభరత్నం ( భిలై

* * *

ఈ వ్యాసంలో వ్రాసినవిధముగానే మాబంధువు ఒకరు అత్తగారు రేడియో కొనివ్వలేదని భార్యన పస్తులుంచి నానా అగచాట్లు పెట్టేవాడు. పాప ఆ అమ్మాయి పుట్టింటికివచ్చి అడిగితే 'మాదగ్గ శక్తిలేదు. తిట్టినా, కొట్టినా మీ అత్తవారింట దగ్గరే పడుండ'మనేవారు. ఆ అమ్మాయి తిప్పల పడలేక ఆత్మహత్యచేసుకొని మరణించినది.

కుమారి డి. జయశ్రీ ( గుంటూరు )

* * *

కుటుంబస్త్రీలు సామాన్యంగా ఒంటరిప్రయాణ చెయ్యరు. వీలులేనిపరిస్థితుల్లో ప్రయాణ చేస్తారు. కొంతమంది ధైర్యంగా ప్రవర్తించే స్త్రీల ప్రయాణం చేస్తారు. సామాన్యంగా నేను ఒంట ప్రయాణాలు చేస్తుంటాను, నా కటువంటి ఏమీ జరుగలేదు. ఏవరో ఒకతను షర్టుతీసి బనీనుతో పోజుకొడ్తూ నిలబడ్డాడన్నారు. మీరు అతని చూస్తేనేగా అతను పోజుపెట్టి ఉన్నాడని తెలిసింది మీ రసలు అతని ముఖంవైపు చూడకపోతే, అతను కాసేపు పోజుపెట్టి మీరు అతని పోజు చూడ కారణంచేత విసిగి వేసారి వెళ్లిపోతాడు. కాని ఒంట ప్రయాణాలకు ధైర్యం అవసరం అక్కగారూ

కుమారి వి. మోహిని (జయంత

* * *

వ్యాసం ఒక కథక్రింద వ్రాసారు కా వాస్తవికతకు దూరముగా ఉంది. వారు వ్రాసినట అబోగి ఎక్కడకు వెడుతుందో తెలియని రై స్టేషనుమాస్టర్లు ఉండరు. అదిగాక రైళ్లలో సామా న్యముగా ఆడవాళ్లపెట్టెలలోనే దొమ్ములాట జరుగుతాయి. మొగవారి పెట్టెలలో ఆడవా చోటిచ్చి మొగవారు నిలబడుతారు. కావా ఎవరూ తప్పుచెప్పరు. దగ్గర దగ్గర స్టేషనుల దిగేందుకని ఆ యువకుడు ఎక్కిఉంటాడు. అం కాని ఒంటరిస్త్రీని గురించి కాదు. కాళీభోగి పడితే సామాన్యముగా ఆడ మొగా చూడకుం దగ్గరదగ్గర స్టేషనులలో దిగేవాళ్లు ఎక్కుత ఉంటారు.

అన్నపూర్ణ (జయపూ

* * *

## అల్లుళ్ళూ-అలుకలూ

వ్యాసం చాలా బాగుంది. కానీ, రచయిత్రిగా చిన్న పొరపాటు చేశారు. ఆమె చెప్పిన తెగవారు అధునికయుగములో చాలా అరుదు. ఒకవేళ ఉ

21-వ పేజీ చూడు

ఎప్పుడూ ఇంతే

శంకర్


అడుగోనండోయ్- అతని తోటే మన పక్కింటి శాంత రోజూ పార్కులకి సినిమాలకి వెడుతూంటుంది-
ఇదో ఇదో...


దాని మొగుడే వాడూ
అవునూ- కాదన్నానా-




నేడే

**తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది!**

వారు నిరక్షరాస్యులో లేక మూఢనమ్మకాల వారో అయివుంటారు. ఆమె వ్యాసం చదివిన ప్రతీ పురుషుడికి ఆమె స్త్రీ అనే స్వార్థంతో కూడి వ్రాసిందని తప్పక అనుమానం వేస్తుంది. భర్తను వేధించుకు తింటూ సత్యభామలా అలకపాన్పులు వేసే స్త్రీల మాటేమిటి ? అంటారు వారు. అటువంటి ప్రశ్నలు రాకుండా ఉంటే బాగుంటుందని నా అభిప్రాయము.

కుమారి ఇందు (సీలేరు)

* * *

కొందరు అల్లుళ్ళు తమకోసం కాకపోయినా తమవాళ్లను మెప్పించడముకోసం కొన్ని వస్తువులు కోరుతూ ఉంటారు. మాకు తెలిసినాయనకి అతని అన్నగారు "మీ మామగారిదగ్గర పండగకి సూట్లు కావాలని అడుగు, పెండ్లిలో యిస్తానన్న రేడియో ఇమ్మను" అని చెప్తూ ఉంటాడు. ఇలాగా మాటలు చెప్పి వాళ్లని రెచ్చగొట్టేవారు కూడా కొందరున్నారు.

ఎమ్. సూర్యకాంతం (టాటానగర్)

* * *

ఎవరికయినా అల్లునకు రేడియోనో, ఫ్యానో యివ్వాలనే ఉంటుంది. వారిదగ్గర డబ్బున్నప్పుడు ఏ పండుగకో పిలిచి యిస్తారు. అటువంటప్పుడు ఈ అల్లుళ్ళ అలుగుట ఎందుకో ? ఇది నాకు అసహజంగా కనిపిస్తుంది. పైగా మామగారు ఇవ్వలేదని భార్యని బాధపెడితే ఆమెమనసు ఎంత బాధపడుతుందో ఆలోచించరు. అందుకే విజయగారు చెప్పినట్లు అల్లుడు దశమ గ్రహమే

కుమారి కె. లక్ష్మీదేవి (శ్రీకాకుళం)

* * *

"విశ్వాసము కలది కుక్క, విశ్వాసహీనుడు అల్లుడు" అన్న వాక్యము కటువుగా ఉన్నది. కాని అది నిజమైనది.

కొప్పోలు స్వరాజ్యలక్ష్మి (విజయవాడ)

* * *

నాకు పెళ్లిఅయి రెండు సంవత్సరములు అయింది. మా అత్తగారు, మామయ్యగారు నన్ను తిట్టని రోజులేదు. ఒకసారి మా ఇంట్లో పిండివంటలు చేసినారు. సిగ్గుచేత నేను తినలేదు. వీళ్ళ ఏనాడైనా వండిపిన ముఖమా అని అనుకొంటూవున్నారు ఆ మాట నేను విన్నాను. ఆరోజున నేను పడినబాధ భగవంతుడికి తెలుసును ఇంకా ఎన్నోరకాలు తిట్లు పడతారు. సహిస్తూ ఉన్నాను.

రాఘవ (పెంటపాడు)

* * *

నిజంగా వారన్నట్లు మధ్యకుటుంబీకుల్లో పిల్లను కట్నాలిచ్చి పెళ్ళి చేయటమే కొండంతపనికాగా, పెళ్ళయినతర్వాత ఈనాటి అల్లుళ్ళ అలుకలూ, ఆర్భాటాలతో ఈ రోజుల్లో కొంతమంది అత్త—మామగార్లు పడే అవస్థలను చక్కగా వ్రాశారు. ఒకవేళ మామగారెంతటి ఆస్తిపరులైనా ఈ అల్లుళ్ళు కోరే కోర్కెలకు ఒక హద్దంటూ ఉండాలి మరి!

"ప్రతి అల్లుడు తన సంపాదనకు ప్రయత్నించాలిగాని, మామగారి పెట్టెపోతలగూర్చి ఆశించ

# వనితా వాణి

18-వ పేజీ తరువాయి

రాదు" అన్న వ్యాక్యాన్ని కాబోయే అల్లుళ్లు గ్రహించి ఆచరించుటకు ప్రయత్నించారంటే బాగుంటుందనుకుంటా?

కుమారి ఎమ్. అరుణ (ఎమ్మిగనూర్)

* * *

"ఎంత వంకరటింకర అయినా పెళ్లి అయ్యేసరికి నిటారుగా నిలుచుంటుంది" ఈమాట నిజం. మా బంధువుల్లో ఒకాయన ఉన్నాడులెండి చాల అమాయకుడు అతని వివాహమై రెండు సంవత్సరాలైంది. ఆయనకు ఏదో అవసరాలున్నాయని డబ్బు కావాలని మామగారిని వేధించుకు తింటూంటాడు. మామగారు డబ్బు ఇవ్వలేదని భార్యను పీడిస్తు ఉన్నాడు. తన భార్యను సంవత్సరానికైనా ఒకసారి తల్లిగారింటికి పంపడు

డి. శకుంతలాదేవి (హైదరాబాద్)

* * *

రచయిత్రిగారు అందరు అల్లుళ్లను ఒక్కటే గాటగట్టి విమర్శించారు. కాని, ఈనాడు నూటికి ఏ ఒక్కరిద్దరో అటువంటివారు తప్ప, సమాజములో అందరు అలా వున్నారంటె మేమొప్పుకోము. 'మామగార్ల రక్తంతో దాహం తీర్చుకుంటున్నారు' అని వ్రాశారు ఇది ఎంతమాత్రం సమంజసంగాదు. మానవుడైనప్పుడు వాని కెంతో కొంత హృదయమనేది ఉంటుంది. రచయిత్రిగారు అల్లుళ్ళను రాక్షసులక్రింద జమకట్టారు. ఇటువంటి మనస్సును గాయపరిచే వ్యాసాలు ఇకముందైనా వ్రాయకుండా, సమాజములోని మంచి చెడ్డలను సక్రమంగా పరిశీలించి, తదనుగుణముగా వనితలు 'వనితాలోకం'కు వ్యాసాలు వ్రాస్తారని ఆశించుచున్నాము.

సిద్ధి వర్సమ్మ, సిద్ధి రాజమ్మ (తేర్యాల)

* * *

"అల్లుళ్ళూ — అలకలు" వ్యాసంలోని విషయాలు చాలా ఆశ్చర్యాన్ని కలిగించేయి. రచయిత(త్రి) గారు తెలిపిచ్చినట్టుగా అటువంటి అల్లుళ్ళులేరని నా అభిప్రాయంకాదు. అయినా ఏకధాటిగా అంత తీవ్రంగా విమర్శించటం బొత్తిగా సబబనిపించటం లేదు. పెళ్ళిళ్ళలో "అలకపాన్పు" అనేది కేవలం లాంఛనం మాత్రమే. దాన్ని పురస్కరించుకుని తాహతుకుమించి (స్కూటరు, ఫ్రిజడైర్ ఇత్యాదులు) కోరికలు కోరటం మూర్ఖత్వానికి నిదర్శనం పెళ్ళిళ్ళలో లాంఛనం పేరుమీదుగా బాధపెట్టడం న్యాయసమ్మతంకాదు. ఏ నాటికైనా మన పెద్దలలో ఆ విషయంలో మార్పువస్తే సంతోషించవలసినదే

శ్రీమతి జోరావ్ (పార్వతీపురం)

* * *

"ఎంతమంది మామగార్ల .... అల్లుళ్ళయిన వారందరూ ఆలోచిస్తే" అంటూ వ్రాశారు అల్లుళ్ళయినవా రందరూ ఆలోచించడం ఎందుకు? ఎదుటివారి కష్టసుఖాలు, ఆర్థిక స్తోమత కించిత్తయినా యోచించక మొండిగా అలుకలకు దిగి, సంసారాలను అశాంతికి, బాధలకు లోనుచేసే అల్లుళ్ళు ఆలోచిస్తే చాలు! పెళ్ళిళ్ళలోని 'అలకపాన్పు అల్లుళ్ళ అలుకలకు తర్ఫీదు ఇవ్వడంకోసమేమో అంటూ విమర్శించారు. పెళ్ళిలో ఎన్నో సంప్రదాయసిద్ధంగా జరుపుతూ ఉంటారు. నిజానికి మనుష్యులకు ఎదుటివారి కష్టసుఖాలు అర్థం చేసుకునే సరిజ్ఞానం ఉండి, అనురాగాలు, ఆర్థిక కొలతబద్దలతో కొలవడానికి పూనుకొనకుండా ఉండాలికాని, సమాజంలోని ప్రతి లోపాన్ని తీసుకెళ్ళి ప్రాచీనవ సంప్రదాయాల నెత్తిన రుద్దడానికి ప్రయత్నించడం అంత సమంజసం కాదేమో!

బొల్లాప్రగడ కామేశ్వరి (అనపర్తి)

* * *

విజయగారు అల్లుడు, మామగారు బహూకరించిన వాచీని చేతులకు అలంకరించుకొనినా డన్నారు. చేతికి అలంకరించుకొనుట వినగుటగానీ, చేతులకెట్లు అలంకరించుకొనగలడు?

వగ్వాల రాజ్యలక్ష్మిచంద్రాదేవి (గుండుగొలను)

* * *

మాకు తెలిసిన ఒకాయన ఉన్నాడులెండి. తను అలగగానే మోటారుసైకిలు ఇవ్వలేదని, భార్య నగలన్నిటినీ తీసుకొని పుట్టింటికి పంపించివేశాడు. కన్నవారు చాలా బీదవాళ్ళు. పాపం ఆ అమ్మాయి ఇప్పటికీ ఇంట్లోనే ఉంది.

అసలు అలుక అన్నది ఆడదానికే అందానిస్తుంది. మొగాళ్లకేం అలుక?

మహారుఖ్ (హీరమండలం) ★

# వంటలు

## కారట్ చట్నీ

### కావలసిన వస్తువులు

| | | |
|---|---|---|
| కారట్ | — | 1 |
| నూనె | — | ½ చెంచా |
| ఆవాలు | — | ½ చెంచా |
| ఉప్పు | — | ½ చెంచా |
| పచ్చిమిరపకాయలు | — | 2 (చిన్నవి) |
| నిమ్మరసం | — | సగం కాయ |

కారట్ దుంపని సన్నటిముక్కలుగా తరిగి (కోరినా పరవాలేదు) ఉప్పు నిమ్మరసం పచ్చిమిరపకాయ ముక్కలు కలుపుకోవాలి. తరువాత తిరగమాత పెట్టుకోవాలి. కొందరు అల్లం, టర్నిప్, బీట్ రూట్ మొదలైన కాయకూరల ముక్కలు కూడ ఇందులో కలుపుకుంటారు. అప్పటికప్పుడు తయారుచేసి వాడుకుంటేనే ఈ చట్నీ రుచిగా ఉంటుంది. ★

ప్రేమ కానుక

బొమ్మలకథ 3

సత్యమూర్తి
























# వీడీ వీడని చిక్కులు

వీరాజీ

## జరిగిన కథ

ఐదు వాటాల లోగిలియిల్లుగలావిడ వరసమ్మగారు మనుమడు సూర్యానికి తల్లీ తండ్రీ తానే అయి పెంచింది. శంకరం గారు హెడ్క్లర్కుగావున్న కంపెనీలో చేరిన సూర్యానికి ఆయనంటే గురి. ఆ ఐదు వాటాల లోగిలిలో రకరకాల కుటుంబాలున్నాయి. అందులో సాంబశివంలలితాంబా వాళ్ళ రాజ్యలక్ష్మికి వరసమ్మగారంటే చనువూ, భక్తీ. ఆపిల్లకి సూర్యం బావంటే పిచ్చి, నిర్మలంటే స్నేహం. సాంబశివం గారికి కలం గాయం. సూర్యానికి నిర్మలంటే సానుభూతి. అదివరకు తెలియని మేనమామ జయరావు రాక, పరిచయం సూర్యానికి గతమంటే భయాందోళనలను కలిగిస్తుంది సూర్యం. నిర్మలకి పాఠాలు చెబుతూంటాడు. జానికమ్మకి సూర్యమంటే ఆసక్తి కలిగింది. సూర్యం ఆఫీసులో 'రీటా' అనే పిల్ల టైపిస్టుగా చేరింది. జయరావు కూతురు మీనాక్షితో సూర్యానికి చనువు ఏర్పడుతుంది. సూర్యం, నిర్మలలనుగూర్చి లోగిలో గుసగుసలు బయలుదేరుతాయి. నూతిగట్టున కాలు జారిపడిన వరసమ్మగారికి నిర్మల ఉపచారం చేస్తుంది.

(గత సంచిక తరువాయి)

"వంటయ్యింది ... భోజనానికి రావూ" ... మీనాక్షి మేడమీదికి వచ్చింది.

సూర్యం ఉలిక్కిపడి "బామ్మ ఏం చేస్తూంది?" అనడిగాడు.

"నిద్ర పట్టింది ...."

"మీ నాన్నగారు వెళ్ళిపోయేరా?" అతనికి మీనాక్షి యోగక్షేమాలు కనుక్కుందికి మనస్థిమితం వచ్చింది.

"అమ్మమ్మగారు పడిపోయేరు .... వెంటనే ఆయనా, "బడికి" వెళ్దామనుకుంటూఉన్న ఆ నిర్మలన్న ఆవిడా .... యిద్దరూ .... గబగబా ఎత్తుకునివచ్చేరు !... అవక, ఆఖరిరైలు దాటిపోతుందనీ .... వెళ్ళక తప్పదనీ, నిర్మలతో డాక్టర్ని పంపించి ఆయన అలాగే వెళ్ళిపోయేరు .... నన్నుండమన్నారు." మీనాక్షి చెప్పింది.

బరువుగా "ఊఁ" కొట్టేడు సూర్యం. తర్వాత, "రాజ్యలక్ష్మి వెళ్ళిపోయిందా?" అని ప్రశ్న వేసేడు.

"అంటే ఆ రెండోపిల్లా?" అని అడిగి "వెళ్ళిపోయింది" అంది మీనాక్షి.

"వంట యెవరూ?"

"ఇంకెవరు? నేనే ...."

"నా కాకలిగా లేదు ...."

"ఏమీ?" .... మీనాక్షికి వంట వండడం

—44వ పేజీ చూడండి

ఎఫ్. బి. ఐ. కథలు-2

# హత్యా మరణించదు!

నార్మన్ అబట్

**ఒక సంవత్సరంలో చాలా మార్పులు వస్తాయి-ఒక వ్యక్తి జీవితంలో కాని, ఒకసమాజం జీవితంలో కాని. అమెరికాలో నార్త్ కెరోలినా రాష్ట్రంలో ఉన్న గోల్డ్స్‌బరో**



**వంటి నగరంవిషయంలో మార్పు చాలా ఉంటుంది.**

రెండవ ప్రపంచయుద్ధంముందు ఇదొక చిన్న బస్తీ; దూది, పొగాకు ఈ ప్రాంతాలలో ఉత్పత్తి అవుతాయికాబట్టి ఈ ఊరు ఒక రవాణా కేంద్రంగా ఉంటూఉండేది.

యుద్ధసమయంలో ఇక్కడ ఒక వాయుదళ విమానాశ్రయంకట్టారు. దానితో నగరం పరిస్థితి బాగా మారిపోయింది. ఆతర్వాత కొన్ని పరిశ్రమలు వచ్చాయి. వీటితో ఊరు పూర్తిగా మారిపోయింది. పోయిన సంవత్సరం (1961) గోల్డ్స్‌బరో జనాభా 30,000. ఇరవై సంవత్సరాల క్రితం ఇది సుమారు 15000 ఉండేది!

కాని ఈకథ గత పన్నెండునెలలోనే జరిగింది. పోయిన ఏడు ఫిబ్రవరి 23 వ తేదీన ఫ్రాంసెస్ వాటర్స్ అనే 24 సంవత్సరాల అమ్మాయిని ఆమెస్వగృహంలో ఎవరో హత్యచేశారు. హంతకుడిని పోలీసులు పట్టుకొనటానికి ఆరునెలలపైన పట్టింది: మిగతాకాలం గోల్డ్స్‌బరో వాసులు ఇతన్ని ఏమిచెయ్యాలా అని ఆలోచించటంతో సరిపోయింది.

## పరిష్కారంలేని సమస్య

ఈరోజుకు మిసెస్ వాటర్స్ హంతకుడినిపట్టి, శిక్షించి సంవత్సరం దాటినా కొన్ని ప్రశ్నలకు ఇంకా సమాధానం దొరకటంలేదు. ఇటువంటి హంతకులు అన్నిప్రదేశాలలోనూ ఉంటారు. వారిసంగతి ఏమిటి?

బుధవారం, 22—2—61 తేదీ సెలవు రోజు— వాషింగ్‌టన్ జన్మదినోత్సవం— కావటం వల్ల బిల్లీవాటర్స్, అతని భార్య ఫ్రాంసెస్‌వాటర్స్, ఇద్దరూ ఇంటిదగ్గరే ఉండిపోయారు. అంతకు ముందే వారి కొత్తఇల్లు పూర్తిఅయింది. బిల్లీ వాటర్స్‌కి విమానాశ్రయంలో పని. ఫ్రాంసెస్ ఒక బాంకులో పనిచేసేది.

—43వ పేజీ చూడండి



# వెండిమబ్బు

కన్నడ మాతృక: త్రివేణి
అనువాదం * శర్వాణి

## జరిగిన కథ

'వెండిమబ్బు' యజమాని సదాశివరావు గారికి ఇందిర ఒక్కగానొక్క కూతురు. పై చదువుకు అమెరికా వెళ్ళాలని కలలు కంటున్న మోహనుడు రావుగారి సిఫార్సు కోసం వచ్చి, నిరాశతో వెళ్ళిపోతాడు. ఇందిరను మోహనుడికిచ్చి పెళ్ళి చేసే సొంత ఖర్చుమీద అతణ్ణి అమెరికా పంపవచ్చునని రావుగారి భార్య లలితమ్మగారి అభిప్రాయం. ఈ సూచన రావుగారికి నచ్చకపోయినా ఇందిర ఇష్టపడిందని తెలిశాక సరేనంటారు. మోహనుడు అతని తల్లిదండ్రులు పెళ్ళిచూపులకు వస్తారు. ఇందిర మోహనుడు ఏకాంతంగా సంప్రదించుకున్న మీదట మోహనుడు అమెరికా వెళ్ళి వచ్చాకనే వివాహం జరగాలని నిశ్చయమవుతుంది.

*

మోహనుడు ప్రయాణసన్నాహాలు పూర్తిచేసుకొని అమెరికా వెళ్ళడానికి సుమారు రెండు నెలలు పట్టాయి. రెండునెలల్లో మూడుసార్లు 'వెండిమబ్బు''కు వచ్చి వెళ్ళాడు.

తోటలో పనిచేసే కూలీలందరూ మోహనుడిని "చిన్నబాబుగారూ" అనే పిల్చేవారు. అతడు మొదటిమారు "వెండిమబ్బుకు" వచ్చినపుడు ఇందిర ఆశ్చర్యపడింది. 'ఆయనకు నామీద ఎంత ప్రేమ' అని పులకితురాలయింది.

మోహనుడు మైసూరునుండి ఇందిరకోసం తక్కువ వెలగల, డాబుసరిగా కనిపించే చీరె, ఇమిటేషన్ ముత్యాల దుద్దులు కానుకగా తెచ్చాడు. వాటిని ఇందిరకు ఇవ్వబోయినపుడు అతనికే చిన్నతనమనిపించింది.

"ఇందిరా, ఇంత తక్కువ వెలగల వస్తువులను నీకు కానుకగా ఇవ్వడానికి నాకు చాలా సంకోచంగా ఉంది కాని నీకోసం ఏమైనా తేవాలనిపించి తెచ్చాను ......"

ఇందిర మారుపలక్కుండా ఆ ఇమిటేషన్ ముత్యాలదుద్దులను అందుకుని త్రిప్పిచూసి, "చాలా బాగుంది" అంది. అంతేకాకుండా తాను పెట్టుకున్న వజ్రాల దుద్దులను తీసివేసి ఆ ముత్యాలదుద్దులను పెట్టుకొని,

"ఎలా ఉంది ?" అంది.

అతడికి ఇందిర పెట్టుకొన్న వజ్రాల దుద్దులే ఆమె చామనచాయముఖానికి బాగా నప్పాయి అని పించినా

"చాలా బాగుంది వజ్రాలకన్నా నీకు ముత్యాలే బాగా నప్పుతాయి." అన్నాడు.

"నిజంగానా ?"

"ఏం, ఎందుకు సందేహం ?"

"నా స్నేహితురాలొకామె అలా అందిలెండి."

"ఆమెకు కళ్ళు లేవు" అన్నాడు మోహన్. కాని మనసులో ఆ స్నేహితురాలి అభిప్రాయాన్నే మెచ్చుకుని "తెలివిగలది ఆమె" అనుకున్నాడు.

ఇందిర మోహనుడిమాట నిజమనే అనుకుంది. అతని మెప్పుకోసం అతడక్కడ ఉన్నన్నిరోజులు ఆ దుద్దులు మార్చలేదు. లలితమ్మగారు మాత్రం,

"ఈ దుద్దులు నీకేం బాగాలేవు. తీసెయ్ !" అన్నారు.

"ఉండనివ్వమ్మా. చూసి ఆనందించాల్సినవాళ్ళే ఏరి కోరి తెచ్చారు" అంది ఇందిర.

"బంగారుదికూడా కాదేమో ? ఇత్తడిచెవికి పెట్టుకుంటె ......"

"ప్రపంచంలో పుట్టినవాళ్ళంతా బంగారమే కావాలంటే ఎలాగమ్మా ? ఇత్తడికూడా అలవాటుచేసుకోవటమే మంచిది" అని పరిహాసంగా నవ్వుతూనే మాట ముగించింది.

కాని తల్లి అలా అన్నప్పుడు ఇందిర మనసుకు ముల్లుగుచ్చుకున్నట్టయింది.

నిజమే మోహన్ తన తండ్రి అంతస్థుకన్నా చాలా తక్కువస్థానంలో ఉన్నాడు కాని ఆవిధ

—39 వ పేజీ చూడండి

#  హమేషా తమాషా 

## సు న్నా

క్లాసులో వున్నా—
మనసెక్కడో వున్న.
వింటూనే వున్నా—
తెలివిలే వున్న.
బుఱ్ఱకెక్కనది సున్నా—
ఎంతసేపయినా—
ఇంట్లో నే చదివినా—
మనసెక్కడో వున్న
పేపరు వాసి వ్రాసివచ్చినా—
పొందగలిగేది సున్నా

పూరి శాలస్వామిగుప్త,
(వెలుదండ)

## ప గ టి చు క్క లు

"ఒకతెకు జగములు వణకున్
నిక్కముగా నిద్దరున్న నీరధులింకున్
ముగురాడువారు గూడిన
సుగుణాకర పట్టపగలు చుక్కలు
రాలున్."

మండపకురిటి సర్వేశ్వరరావు,
(భవానీపాట్నా)

## త న కు తా నే!

జేమ్స్ మెకిన్‌టోష్ అనే ఒక స్కాటిష్ డాక్టరు 42 ఏళ్ళ వయస్సప్పుడు తనకు తనే ఒక ఉత్తరం రాసుకుని 65 వ ఏట చదువుకునేందుకు అట్టేపెట్టుకున్నాడు. అందులో కొన్ని సలహాలు ఉన్నాయి.

"నీ ప్రవర్తనలో కొన్ని లోపాలు అప్పుడే స్ఫుటంగా కనిపిస్తున్నాయి. వయస్సుమీద పడుతున్నకొద్దీ ఈ లోపాలు గోరంతలు కొండంత లవుతాయని నిస్సందేహంగా చెప్పవచ్చు.

"నువ్వు ఇప్పటికంటేకూడా ఎక్కువ వదురుబోతు వవుతావు. ఈలోపాన్ని సరిదిద్దుకున్నావా సరే. లేకపోతే నువ్వు నేర్చుకోగలిగిందేమీ ఉండదు. ఇతరులు ఏమి చెబుతున్నారో వినేందుకు ప్రయత్నించు. యాంత్రికంగా బుఱ్ఱఆడించటంతో తృప్తిపడకు"

"రెండో సంగతి: వయస్సులో ఉన్నవారి వ్యవహారాలు తెలుసుకోవాలని తాపత్రయపడటం మానుకో — ఆఖరికి వాళ్ళకేదో సహాయం చేస్తున్నానన్న మిషతో నైనాసరే."

"మరోవిషయమేమంటే 'మంచి తాతయ్య' లా పోజుపెట్టి ఇతరులు నీగురించి ఏమనుకుంటున్నారో తెలుసుకునేందుకు ప్రయత్నించకు. నీకిప్పుడు 65 ఏళ్ళు వచ్చాయి. ఇవ్వాళ్లో, రేపో రిటైర్ అవుతున్నావు. నీకేదో ప్రత్యేకత ఉన్నదనే భ్రమలో పడకేం. సమయం వచ్చినప్పుడు గుట్టుచప్పుడు కాకుండా ఉద్యోగం విరమించుకో."

"నువ్వు నీ శరీరానికి, మనస్సుకి తగిన పరిశ్రమ ఇచ్చావంటే ఒక కొత్త ప్రపంచం కనిపిస్తుంది. మర్యాద, హుందాతనం, సహనం అన్న మూడు సద్గుణాలు ఉన్నాయి. వాటిని వృద్ధిపరచుకో. సహనం అంటే ఇతరుల దృక్పథం ఏమిటో తెలుసుకోగల లక్షణమన్నమాట .........."



మేము పార్టీ మీటింగు వినడానికి వచ్చామా ఏమిటో— మీటింగుకి ముందు వాళ్ళేసే క్రొత్త సినిమా రికార్డులు వినడానికే వచ్చాం గానీ...!

చిత్రకారుడు: ఎగ్గోని శ్యామ్‌సుందర్.

65 వ ఏడు వచ్చిన రోజునే మెకిన్‌టోష్ ఉత్తరంతీసి జాగ్రత్తగా చదువుకుని తనకు తనే ఇల్లా ఒక సమాధానం రాసుకున్నాడు: "23 ఏళ్ల క్రితం నువ్వు రాసిన ఉత్తరానికి కృతజ్ఞుణ్ణి. ఉత్తరం ఏదో కొంత గంభీరంగా కనిపించింది — నిజమే మరి. అది నీ తండ్రి అంత వయస్సు కలవాడికి రాసిన ఉత్తరం కదూ... నీ సలహాలు పాటించడానికి ప్రయత్నిస్తాను."

డా॥ మెకిన్‌టోష్ అప్పటికే పదేళ్ళు 'లండన్ స్కూల్ ఆఫ్ హైజిన్ అండ్ ట్రాపికల్ మెడిసిన్' అధికారిగా పనిచేశాడు. ఉత్తరం చదివినతరువాత రిటైరయ్యాడు.

రామారావు (బెజవాడ)

## ని ర్వ చ న ం

దేశమంటే మట్టికాదోయ్!
దేశమంటే పదవులోయ్!
పదవులను ప్రేమించుమన్న!
పలుకుబడినే పెంచుమన్నా!

[కుమార్]

* * *

## కౌబోయ్ కథకులకు పనికిరాని చిట్కాలు

మీరు రాసే కథలకన్నా మేము చదివేవే బాగుంటున్నాయి! అయినా మీరు కూడా ఎక్కడ రాసేస్తారోనని మేమెప్పుడైనా భయపడ్డామని ఆలోచించారా? ఇప్పుడూ పడుతున్నారా? పడండి. ధైర్యం వదులుకుని చదవటం మొదలు పెట్టండి!

### మీ పేరు అచ్చులో పడలేదు!

అధైర్యపడకండి! పడకపోవటమే మంచిది అనవసరంగా తిట్టుతింటారు. పేరు తెచ్చుకోవలసిందే (చెడ్డ పేరు కాదు, మంచి పేరు!)

పత్రికలు చదవండి. కథావస్తువులన్నీ ఇంతకు ముందే రాసేశారే అనిపించటం లేదూ?

కుక్కపిల్లా
అగ్గిపుల్లా
సబ్బుబిళ్లా
ఇవన్నీ మా కథల కవర్హం!

—పోనీ కొందరికి దీనినిగురించేనా కథం రాయొచ్చు-అవును! కాని చదివేవారెవరు?

"ఒక కుక్కపిల్ల పడుకునివుంది. నేను దాని తోక తొక్కాను. అది లేచి నన్ను కరిచింది నేను పారిపోయాను. పారిపోతూ ఒక రచయితను ఢీకొన్నాను. ఆయన చేతిలో వ్రాతప్రతి అదిరిపడిపోయింది. కోపంవచ్చి నన్ను చితకొట్టాడు. అప్పటినుంచి కథలంటే భయం నాకు."

నిరుత్సాహపరచటం చాలు. ఇంకా మీకు సలహాలు ఇవ్వను. ఇక మీ ఇష్టం—

రాత్రిలావు, [బొమ్మశేష్ణవు!]

* * *

## గెలుపెవరిది?

ఓ ప్రముఖ సంగీతదర్శకుణ్ణి ఒక నిర్మాత విందుకు ఆహ్వానించాడు.

"ఏం విందులో! వాటికి వెళ్లడమంటే నాకు చికాకు. తీరా వెడతామా విందు అయ్యాక పియానో వాయించమని నాప్రాణం తీస్తారు. రోజల్లా విశ్రాంతి ఉండదు." సంగీతదర్శకుడు తన మిత్రుడుతో మొరపెట్టుకున్నాడు.

మిత్రుడు ఎలాగైతేనేం నచ్చచెప్పి అతణ్ణి విందుకు తీసుకువెళ్ళాడు. భోజనాలయ్యాయి. ఇంటి యజమాని వచ్చి పియానో వాయించమని అడిగినా తాను వాయించకూడదని సంగీత దర్శకుడు నిశ్చయించుకున్నాడు. ఒక గంట గడిచింది.

అతడువచ్చి అడగనూలేదు; ఇతడు వెళ్లనూలేదు. మరోగంట గడిచింది. సంగీత దర్శకుడి పట్టుదల సడలింది. అయినా ఎవ్వరూ వచ్చి అతణ్ణి పియానో వాయించమని కోరలేదు. అతడికి కోపం వచ్చింది. చీకటి పడుతోంది; అతడికోపం పట్టశక్యంకాకుండా ఉంది.

"ఏమిటి ఇతడి ఉద్దేశ్యం? పియానో వాయించమనడేం? ఇంతమందిలో నన్ను గాడిదను చెయ్యాలనేగా!" సంగీతదర్శకుడు మిత్రుడి చెవిలో ఊది సరసరా వెళ్ళిపోయాడు.

ప్రమీల (మద్రాసు).

* * *

ప్రముఖ డిటెక్టివ్ కథా రచయిత సర్ ఆర్థర్ కానన్ డాయల్ మొదట డాక్టరుగా పని చేసి, గిట్టుబాటు కాక కథలు రాయటం మొదలుపెట్టాడు. అట్టే మంది రోగులు అతడిదగ్గరకు వచ్చేవారు కాదు.

ఒకరోజున ఓ పెద్దమనిషి ఖంగుఖంగున దగ్గుతూవచ్చాడు.

"మీకు ఉబ్బసంలాగుంది" డాయల్ మందు కలుపుతూ అన్నాడు.

"అవునండీ."

"మరేం ఫరవాలేదు! మంచి మందు పుచ్చుకుంటే త్వరలోనే తగ్గుతుంది."

"అలాగే! కాని నేను మీ దగ్గరకు వచ్చింది మందుకోసం కాదు; 'గాస్' బిల్లుకోసం."

ఎ. సత్యమూర్తి (విజయనగరం)

★






దైవజ్ఞపాతూరి శ్రీరామమూర్తి

**29-6-1962 శుక్రవారము మొదలు**
**5-7-1962 గురువారము వరకు**

### మేషం :

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

గ్రహస్థితి బాగున్న సమయం. మొదట మీకు సంకోచం కలిగినా మిమ్ములను ప్రోత్సహించేవారు లభిస్తారు. ఆదాయం బాగుంటుంది. తలవని తలంపుగా మీ మాటలవల్ల ఇతరుల మనస్సుకు బాధ కలుగగల అవకాశా లున్నవి. కుటుంబంలో శుభ సంతోష కార్యాలు జరుగుతవి. ఎదురుచూస్తున్న వార్తలు సకాలంలో అందుతవి మీ దేహస్థితి సంతృప్తికరంగా ఉండదు. తరచూ నరములయందు బాధ, బలహీనత కనుపించుచుండును ఇంతకు ముందున్న దుబారాఖర్చులను తప్పించుకొన గలుగుతారు. వృత్తిలో ముందు ముందు అభివృద్ధిని సాధించగలమనే ధైర్యం కనుపిస్తుంది. పరోపకార కార్యాలలో ఆటంకాలను ఎదుర్కొనగల ధైర్య స్థైర్యాలు లభిస్తవి. 29, 30 తేదులలో కార్యసిద్ధి, బంధు విరోధము, క్రొత్త పనులయందు ప్రవేశము.

* * *

### వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)**

మనస్సులో ఆరాటం అధికం అవుతుంది పైన పెట్టుకున్న బాధ్యతలు చురుకుగా నెరవేరవు అన్ని రంగాలలోను శుభసూచనలు కనుపిస్తూ ఉంటవి పెద్దమనుష్యుల పరిచయం లభిస్తుంది. ప్రస్తుతం వ్యవహారకార్యాలలో మీ మాట సాగేటట్లు కనుపించదు. కొన్ని సమయాలలో ఇతరులవద్దనుంచి రావలసిన ధనం నిమిత్తం ప్రసంగాలు పెరగవలసి వస్తుంది. వృత్తికిసంబంధించిన కార్యక్రమాలలో ముందువెనుకలు ఆలోచించుకొంటూ తోటి వారిని నొప్పించకుండా జాగ్రత్త పడటం అవసరం. వారం చివరలో శుభవార్తలు వస్తవి. వినోద కార్యక్రమాలు మొదలైనవాటికై ఖర్చులు పెరుగుతవి. 1, 2 తేదులలో కుటుంబంలో కలతలు, వస్తునష్టం.

**గ్రహస్థితి**

మేష వృషభాలలో అంగారకుడు, వృషభంలో బుధుడు, మిధునంలో సూర్యుడు, కర్కాటకంలో శుక్ర, రాహువులు, మకరంలో శని, కేతువులు, కుంభంలో గురువు, వృషభ మిధున కర్కాటక సింహాలలో చంద్రుడు

* * *

### మిధునం :

**(మృగశిర 3, 4 పా., ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

ప్రయాసపడి ఫలితం దక్కించుకొనలేని పరిస్థితి కనుపిస్తుంది. ఈ సమయంలో ఎవ్వరితోను ఆడంబరాలు పలుకటం మంచిదికాదు. మీ చేతిలో ఉన్న అవకాశాన్ని స్నేహితులమాటలు నమ్మి వృధాగా జారవిడుచుకొంటారు. పిల్లలవలన ఖర్చులు పెరగగలవు. కాని, సుఖసంతోషాలు లభిస్తవి. ఆదాయాన్ని మించిన ఖర్చులు, తోటివారి అభిప్రాయం నిమిత్తం ఎదురుచూడకుండా అవకాశం ఉన్నంత వరకు మీ పనులను మీరే సమర్థించుకొనటం మంచిది విలువగల వస్తువులుకాని, డబ్బుకాని ఇతరులచేతికి పోకుండా చూచుకొనండి. తలవని తలంపుగా ఇంతకుముందు ఆరంభమయిన వ్యవహారాలు పరిష్కారమవుతవి. వృత్తి ఉద్యోగాలలో ప్రశాంతమైన కాలం. 3, 4 తేదులలో మానసిక ఆందోళన, వృత్తిలో పోటీ, వృధాఖర్చులు.

* * *

### కర్కాటకం :

**(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష)**

శక్తి సామర్థ్యాలకు తక్కువలేకపోయినా, సమయంకోసం ఎదురుచూస్తూ ఉండవలసి వస్తుంది. కుటుంబంలోనివారు మధ్యలో కొంత వ్యతిరేకభావంతో మాట్లాడి చివరకు మీతో ఏకీభవిస్తారు పిల్లల ఆరోగ్యం బాగుంటుంది. చేతిలో ఉన్నది అయిపోయేవరకు రావలసినదికూడా రాక పోవటంవల్ల మీరు తలపెట్టిన పెద్దపనులు ఏవీ చురుకుగా సాగవు విద్యావిషయంలో తాత్కాలికంగా శ్రమ తప్పదు వృత్తి ఉద్యోగాలలో ఇతరుల సహాయం లభిస్తుంది బంధుమిత్రుల రాకపోకలు అధికం. ఉత్సాహకరమైన వార్తలు తెలుస్తవి. ప్రయాణాలు సానుకూలం అవుతవి. వారాంతంలో కార్యభారం పెరుగుతుంది. 4, 5 తేదులలో కార్యసిద్ధి, పుణ్యకార్యాలు, పొరపాట్లు.

* * *

## సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

పరమేశ్వరానుగ్రహంవల్ల ప్రతి విషయంలోను జయించుకుని రాగలుగుతారు. రాజకీయాలలో మంచి పేరు లభిస్తుంది. వృత్తి వ్యాపారాలలో వచ్చిన వివాదాలు మీకు అనుకూలంగా పరిష్కారం అవుతవి. డబ్బు లెక్కచేయకుండా మీ బాధ్యతలను కొనసాగించగలుగుతారు. క్రమక్రమంగా మీ మనస్సు ప్రశాంతమైనస్థితికి వస్తుంది అధికారులు మిమ్ములను ప్రోత్సహిస్తారు. పిల్లల నిమిత్తం శ్రమ పడవలసిన సమయము. విందులు, వినోదకార్యక్రమాలు మొదలయినవాటిలో పాల్గొంటారు మీకు నిరుత్సాహం తోచగల చిన్న చిన్న పనులలోనే సంతృప్తికరమైన ఫలితం పొందగలుగుతారు అకస్మాత్తుగా ధనం లభించగల అవకాశా లున్నవి. 2, 3 తేదులలో సంఘంలో గౌరవం, సాధారణ విషయాలలో కలహసూచనలు.

* * *

## కన్య :

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

సుఖం తక్కువే గాని, మంచి ఫలితం పొందగలుగుతారు. సమయంలో ఇతరులకు సహాయం చేయగల అవకాశాలు లభిస్తవి కలహాలు వస్తవనే భయం తొలగిపోతుంది మీ కుటుంబంయొక్క సుఖసంతోషాల నిమిత్తం ధనవ్యయం చేయవలసి వస్తుంది. దక్షిణదిక్కు నుంచి శుభ, లాభవార్తలు తెలుస్తవి. తమాషా ప్రసంగాలు ఆరంభమై చివరకు మనస్పర్థలు రాగల సూచన లున్నవి. పరిస్థితులు మించకుండా చూచుకొనండి వ్యవహారరంగంలో కొన్ని పనులు అసాధ్యంగా కనుపించినా మీరు పూనుకొనగానే సులభంగా నెరవేరిపోతవి. వారం రెండవ భాగంలో జీర్ణకోశాలలో బాధపడతారు. 30, 1 తేదులలో వృధాశ్రమ, ఆందోళన, సాధారణఫలితము.

* * *

## తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

మీ మాటను పూర్తిగా చెల్లించుకో గలుగుతారు. అయితే మీతో స్వతంత్రంగా ఉంటున్న మనుష్యులు దూరంకాగల సూచన లున్నవి. ఎప్పుడెప్పుడు ఎంత వరకు అవసరమో అంతవరకు ధనం లభిస్తూ ఉంటుంది. పిల్లల ఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండండి. మీ విద్యను, బుద్ధిబలాన్ని వినియోగించుకొని పదిమందిలో పేరు ప్రతిష్ఠలను ఆర్జించుకో గలుగుతారు డబ్బుకు సంబంధించిన లావాదేవీలలోనూ, లెక్కలు వ్రాయటంలోనూ ముందు పొరపాట్లుచేసి పర్దుబాటు చేసుకుంటారు తగినంత కారణం లేకపోయినా అధికారులవల్ల మాట వస్తుందేమోనని ఆందోళన కలుగుతుంది. లాభకరమైన ఆశలు కనుపించినా శక్తికి మించిన పనులలో దిగవద్దు. 29, 30 తేదులలో కొన్ని సందర్భాలలో విశేష ఫలితం, మరికొన్ని వ్యవహారాలలో చిక్కు సూచనలు.

* * *

## వృశ్చికం :

**(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)**

ఈ వారం అనేక ముఖ్యసమస్యలనుంచి బయట పడగలిగామనే సంతృప్తి కలుగుతుంది. మీ వ్యవహారాలు పరిష్కారంకాకుండా అడ్డుతగిలేవారిని తొలగించుకో గలుగుతారు బంధుమిత్రులతో సంప్రదింపులు సుముఖంగా జరిగి కార్యక్రమాలను నిరయించ గలుగుతారు. ధనవ్యయం జరిగినా సక్రమమైన వినియోగం ఉంటుంది. ఒకానొక సమయంలో కుటుంబంలోనివారి ఆరోగ్యంగురించిన ఆందోళన ఏర్పడుతుంది. కాని, వెంటనే తొలగిపోతుంది. నౌకరులు మొదలయినవారు చక్కగా మీ మాటను అనుసరిస్తారు. అధికారులను కలుసుకొనే సందర్భాలలో జాగ్రత్తగా ఉండండి. 30, 1 తేదులలో పుణ్యకార్యాలు, నిరుత్సాహసూచనలు, ఆదాయవృద్ధి.

* * *

## ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

ఈ సమయంలో ధైర్యమే ప్రధానం. అనుకోకుండా మీ వృత్తిఉద్యోగాలలో జరిగే సంఘటనలు ఆందోళనను కలిగిస్తవి చెప్పుకోతగిన మార్పులు ఏమీ ఉండవు. "కరవమంటే కప్పకు కోపం, విడవమంటే పాముకు కోపం" అనే స్థితిలో చిక్కుకుంటారు ఇతరులచేతికి పోయిన వస్తువులుకాని, డబ్బుకాని సక్రమంగా రాక పోవచ్చు. ఆదాయంలో పెద్దగా పెరుగుదల ఉండదు కాని పదిమందిలో ఘనత, ఆడంబరము, విశ్రాంతి లేని కార్యక్రమాలు టైము సరిపోతూ ఉంటుంది. బంధుమిత్రులవద్దనుంచి ఎదురుచూస్తున్న వార్తలు ప్రస్తుతం అందకపోవచ్చు వారాంతంలో అనారోగ్యం చేస్తుంది. 1, 2 తేదులలో భాగస్తులతో స్పర్థలు, మధ్యవారి మాటలవల్ల కార్యభంగం.

* * *

## మకరం :

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

మీరు చెప్పేదీ, చేసేదీ న్యాయమే. అయితే ఎదటివారిని ఒప్పించడమే కష్టం. అందువల్ల కొన్ని పనులు మాత్రమే పూర్తిచేయ గలుగుతారు మొత్తం మీద వ్యవహారరంగంలో జయం సాధించగలుగుతారు. మీచేత పనిచేయించుకొంటూ సమయంలో చల్లనిమాటలతో తప్పించుకొనేవా రుంటారు. చివరకు స్వశక్తిమీదనే ఆధారపడవలసి వస్తుంది. ఆదాయం కొంచెం మందంగా ఉంటుంది కుటుంబంలో ఒకవిధమైన కొరతమాత్రం తోస్తూ ఉంటుంది. ప్రధానమైన కారణాలు ఏమీ ఉండవు. లలితాస్తోత్రపారాయణం చేసుకొనటంవల్ల కార్యసిద్ధి, చిత్తస్థైర్యము లభిస్తవి. 2, 3 తేదులలో కష్టవార్తలు, వృత్తిలో అనుకూలత.

* * *

## కుంభం :

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

మీ ప్రయత్నం పెద్దగా లేకపోయినా ఏ సమయంలో జరుగవలసిన పని ఆ సమయంలో చల్లగా జరుగుతుంది. అన్నివిధాలా పేరు ప్రతిష్ఠలు లభిస్తవి. సంఘంలో మీ మాట చక్కగా చలామణి అవుతుంది. విద్యార్థులకు మంచికాలము. అధికంగా డబ్బును వినియోగించి వాహనాలు మొదలైనవి కొనే ప్రయత్నాలు కలిసివస్తవి. ఒకానొక సమయంలో అల్పులతో కలహప్రసంగాలు రాగల అవకాశా లున్నవి. వృత్తి, వ్యాపారాలలో ఎవరు ఏ సలహా చెప్పినా క్రొత్త మార్గాలను అనుసరించతగిన సమయం కాదు. వారం రెండవభాగంలో ప్రయాణం చేయవలసి రావచ్చు. ఉపయోగంలేని వ్యవహారాలలో ప్రవిష్టకు ప్రాకులాడవలసి వస్తుంది. 4, 5 లలో అనారోగ్యం, వృధా ప్రసంగాలు.

* * *

## మీనం :

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)**

మీ స్నేహితులే మీ మనస్సును చికాకుపరుస్తూ ఉంటారు. స్వబుద్ధితో జరుపుకున్న పనులలో ఫలితం బాగుంటుంది. కుటుంబంలో నెమ్మదిగా ఉంటుంది. నలుగురు మీమాటను అనుసరిస్తారు. గతవారంకన్నా ఆదాయం తగ్గినట్లున్నా మీ అవసరాలకు ఇబ్బంది కలుగదు. ముందు యోచించుకొనటానికి అవకాశం ఉండదు. కాని, ఆయా సమయాలకి తగినట్లు చురుకుగా ప్రవర్తించ గలుగుతారు. సాధ్యమైనంతవరకు కార్యభారం తొలగించుకొని ప్రశాంతంగా ఉందామనే భావం తోస్తుంది. ఈ సమయంలో పూర్తిగా సాధ్యం కాదు. విలువగల వస్తువులు కొంటారు. 2, 3 లలో వృత్తిలో పోటీ, కలహప్రసంగాలు. ★

## ఈ వారము ధరలు

బంగారు ధర వారం మధ్యలో తగ్గుతుంది. వెండిధర కొద్దిగా పెరగగలదు. ప్రత్తిధర నిలకడగా ఉండదు. మొత్తంమీద తేజీలో ఉంటుంది. వసువుధర తేజీవచ్చి నిలుస్తుంది. నూవులధర మొదట పెరిగి వెంటనే తగ్గుతుంది. వేరుశనగపప్పు ధరలో తేజీ ఆరంభం అవుతుంది. మానెధర నిలకడగా ఉండి వారాంతంలో పెరుగుతుంది. కర్పూరం ధర పెరిగి వారాంతంలో మందీ వస్తుంది. మిర్చిధర వారాంతంలో పెరుగుదల ఆరంభమవుతుంది.

ఆంధ్రసచిత్రవారపత్రిక

# దీపావళి కథలపోటీ

## మొదటి బహుమతి రు. 600
## రెండవ బహుమతి రు. 350
## మూడవ బహుమతి రు. 200

ఎప్పటివలె 1962 దీపావళికి కథలపోటీ నిర్వహించ నిశ్చయించాము. రచయితలుకూడా ఎప్పటివలె మాతో సహకరించి ఈ పోటీ జయప్రదం చెయ్యగోరుతాము.

నిబంధనలు

- కథలు స్వంత రచనలై ఉండాలి. అనువాదాలు పంపరాదు.
- కవరుపైన "దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా వ్రాయాలి.
- రచనలు తిప్పి పంపగోరువారు తమ పూర్తి చిరునామాకల కవరు జతపరచాలి.
- కథ ఇరవై అరఠావు పేజీలు మించరాదు.
- కాగితానికి ఒకవైపుననే వ్రాయాలి.
- పోటీలో బహుమతి పొందని కొన్ని కథలను విడిగా ప్రచురించవచ్చు.
- వ్రాతప్రతులు 31-8-62 లోగా మా కార్యాలయం చేరాలి.
- పోటీలో తుది నిర్ణయాలు సంపాదకులవే. ఈ విషయమై ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

# హాయ్ వాథా అద్భుతగాథ

మూలం: లాంగ్‌ఫెలో

అనుసరణ: పి. గణపతిశాస్త్రి



## జరిగిన కథ

జాబిల్లి చిన్నారి భార్య నోకోమిస్ ముద్దులమూతురు వెనోనా. పడమటిగాలి అనే తుంటరివాడు వెనోనాను మోసగించి మటుమాయమవుతాడు. వెనోనా హాయవాతాను కని దిగులుతో మరణిస్తుంది. నోకోమిస్ మనుమణ్ణి చేరదీస్తుంది. హాయవాతా క్రమక్రమంగా పెరిగి పెద్దవాడవుతాడు. ఒకరోజున భూతవైద్యుడొకడు హాయవాతాకు జింక చర్మంతో తయారుచేసిన విచిత్ర కవచాలు, పాదరక్షలు ఇస్తాడు. వాటిని ధరించి అతడు ఎందరెందరో వీరులను ఓడిస్తాడు.

అంత పరాక్రమశాలి అయినా తన తల్లిదండ్రులెవరో తెలియక హాయవాతా మనోవ్యాధికిలోనవుతాడు. నోకోమిస్ జరిగిన కథ అంతా పూసగుచ్చినట్లు చెబుతుంది. హాయవాతా పడమటిగాలిమీద పగతీర్చుకోవాలని బయలుదేరివెడతాడు. అదృష్టుడికి దేనివల్ల ప్రాణభయం కలుగుతుందో తెలుసుకుంటాడు. సమయం కనిపెట్టి హాయవాతా తన తల్లి సంగతి ప్రస్తావిస్తాడు. పడమటిగాలి అంటీ ముట్టనట్టు సమాధానం చెబుతాడు. హాయవాతా కోపం కరుడుకడుతుంది. పరుగున వెళ్లి పడమటిగాలికి ప్రాణభయం కలిగించే కొండ శిఖరాన్ని తన పిడికిటి పోట్లతో నుగ్గుచేసి అతడిమీద రాళ్లు విసురుతాడు. పడమటిగాలి భయపడిపోయి ఓ పాడుగాటిచెట్టును పెకలించి దానిమాటున ఆత్మరక్షణ చేసుకుంటాడు. అతని దీనాలాపాలు విని హాయవాతా యుద్ధం మానేస్తాడు. పడమటిగాలి వెనోనాకు తాను చేసిన ద్రోహాన్ని ఒప్పుకుని పరితపిస్తాడు. తన రాజ్యాన్ని కొడుక్కి అప్పగిస్తాడు. హాయవాతా కొంతకాలం తండ్రిదగ్గరే ఉండి అటుతరవాత నికోమిస్ భవంతికి ప్రయాణమవుతాడు.

---

తండ్రిదగ్గర సెలవు తీసుకున్న తరవాత హాయవాతా పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ కన్నుమూసి తెరిచేలోగా ఎంతో దూరం సాగిపోయాడు! ఆలోగా ఉత్సాహం పట్టలేక అతడు గొంతెత్తి పాడడం మొదలు పెట్టాడు. మరికొంత సేపటికతనినడక బాగా మందగించింది. మళ్లీ సామాన్యం మనిషిలాగే నెమ్మనెమ్మదిగా అడుగులు వేసుకుంటూ కొండలమ్మట గుట్టలమ్మట తన ప్రయాణం కొనసాగించాడు. దారిలో కంటబడిన క్రూరమృగాన్ని దేన్ని ప్రాణాలతో దాటిపోనియలేదు! అతడు ప్రయోగించేన బాణం ప్రతీది రివ్వుమని దూసుకుపోయి క్షణంలో క్రూరమృగాల గుండెలు చీల్చింది! ఆ బాణాలు తయారుచేసిన వ్యక్తి చాతుర్యం తలుచుకుని తలుచుకుని మాటిమాటికీ నిలువునా నిర్ఘాంతపడ్డాడు హాయవాతా!

అలాగ మరికొంతదూరం సాగిపోగానే అతన్ని ఎవరో గొంతెత్తి పిలిచారు. పక్కకి తిరిగి చూసేసరికి అతని కల్లంతదూరంలో ఇయాగూ కనిపించాడు. మరుచటి క్షణంలోనే అతడు పరుగుపరుగున వచ్చి హాయావాతాని గాఢంగా కౌగలించుకున్నాడు:

"నాయనా! హాయవాతా! క్షేమంగా తిరిగివచ్చావా! మీ అమ్మమ్మ, నేను నువ్వు ఏమయిపోయావో అని చాలా బెంగపెట్టు

అనగా అనగా ఒకవూరు. ఆవూరు పెద్దవూరు. ఊళ్లో ధనవంతులున్నారు—కాఫీహోటళ్లూ, సినిమాహాళ్లూ ఉన్నై. ధనవంతుల్లోకల్లా ధనవంతుడినని తలపోసే ఒకధనవంతుడు, ఒకనాడు తన పట్టుసోఫాపై పవళించి ఇట్లా తలపోయసాగాడు:

"అయ్యో, ఇదేం పిచ్చి? నా కుమారరత్నం సినిమా తీస్తానంటాడేమిటి? సినిమా చూస్తానంటే బావుందిగాని, తీస్తాననటం ఏం బావుంది? వాడికి బావుందిట. సినిమా తీస్తే ఇంకా బావుంటుందిట — లేకపోతే ఒంట్లో ఏం బావుండదుట. ఏం చెయ్యను? వాడికి తెలీదు గదా — సినిమాతియ్యటం! అది ఎట్లా తీస్తారో నాకే తెలీదు. మామూలుగా పెట్టెలోంచి సామాను తీసినట్టు తీస్తారా! అదేం సోదో!

"నాకు తెలుసు, నేను తీస్తానంటాడు కుమారరత్నం. బోలెడంత డబ్బు కావాలిట—లక్షలుట! ఐదులక్షలు చాలంటాడు. ఇవ్వకపోతే ఆత్మహత్య చేసుకుంటానంటున్నాడు. చేసుకుంటే నేను పుత్రవిహీనుడిని ఐపోతాను. నాకు రేపొద్దున్న తద్దినాలు ఎవడు పెడతాడు? నాకు తద్దినం పెట్టడానికేనా వీడు బతకాలి. వీడు బతకాలంటే ఐదులక్షలు గుమ్మరించాలి. ఏంజేతునో, ఏంజేతును?" అని ధనవంతుడు లోలోన దుఃఖించసాగాడు.

"నమస్కారం ధనవంతుడుగారూ"

ధనవంతుడు కళ్లు తుడుచుకుని అవుట్ బ్లాక్ లోకి తలపాన్ చేసి, ఆశ్చర్యం అభినయించి, కాలు ముందు కిందుంచి, లేచి, చిర్నగవు చిందించి ప్రతి నమస్కారం సంధించి "మీరా, దయచేయండి—ఎప్పటినుంచి రాక?" అని అడిగాడు.

సినిమాలో నారదుడు ప్రవేశించి, ఆసనమలంకరించే పద్ధతిలో ఒకతను వచ్చి కూర్చున్నాడు. ధనవంతుడు 'ఎప్పు....' అనేటప్పటికే, 'మద్రాసు నుంచే' అన్నాడు—అంటూనే కూచున్నాడు. అతను మాజీ దర్శకనిర్మాత.

"మనవాళ్లంతా..." అనబోయాడు ధనవంతుడు.

"ఆహా—అంతా తమదయవల్ల క్షేమంగానే యున్నారు ధనవంతా"

ధనవంతుడు 'అటులనా' అని ఊరుకున్నాడు. కళ్లమీద వేళ్ల తోరాన్ని వేళ్లు తుడుపుతూ.

"అదేమిటిసార్, దుఃఖిస్తున్నారా— సుఖించాల్సిన తమబోటి...."

"సుఖధనంలేని జీవితం ఏంజీవితం?" అన్నాడు ధనవంత రవంత నిట్టూర్పుతూ.

"ఏమిటది, డైలాగు మరీ పాతిక కిలోలబరువుంది. ఏమిటీ, ఏమిటండీ, మనవారెవరైనా కొంపదీసి...."

"మీదయవల్ల ఎవరూ చావలేదు మహాశయా—కాని చావబోతాట్ట."

"ఎవరు?"

"నాకుమార రత్నం"

"చావగొట్టండి. ఏమిటామాట? వాడికేం — బోలెడంత డబ్బు, బోలెడంత కారూ, బోలెడంత మీరూ...."

"వాడు సినిమా తీస్తానంటున్నాడు మహాశయా, సినిమా తీస్తానంటున్నాడు."

మహాశయుడు ఒక్కయెగురు ఎగిరాడు. పైదూలం 'తప్'మని తలకాయమీద మొట్టింది. కిందపడేవరికి, సోఫాస్ప్రింగు పైకితన్నింది—మళ్లీదూలం మొట్టబోయింది గాని, పాపం అందలేదు. మహాశయుడు ఇవేవీ పట్టించుకో



## చిత్రలాభము

లేదు. మొదటిఏగురులోనే, "సినిమావా, ఎప్పుడు? ఎప్పుడు? ఎవరుదర్శకుడు?" అని కేకలువేయసాగాడు. ఈ గొడవా, కేకలూచూసి, అతడు ఏతేలో పామో కరిచింది కాబోలనుకుని, తనూ గాభరాపడి "ఏంజరిగింది ఏంజరిగింది — ఎక్కడ కరిచింది? నాసోఫాలో పాములేమిటి—కనీసం తేళ్లేమిటి—ఒరే నౌకర్లూ — ఒరే చాకర్లూ ఎవర్రా అక్కడ, అక్కడెవరు?" అంటూ గుక్క తిప్పుకోకుండా అరవసాగాడు ధనవంతుడు.

"ఎవరక్కడ, అక్కడెవరు?" అన్నాడు మళ్లీ —ఇంకా పైస్థాయిలో.

"ఎక్కడ— ఎక్కడసార్?" అంటూ ప్రవేశించాడు నౌకరొకడు, నాలుగుమూలలా కలియచూస్తూ 'ఎవరక్కడ'అనిధనవంతుడుఅరుస్తూవుంటే ఏదొంగో, హంతకుడో వచ్చాడనుకుని, చేతికందిన ధనవంతుడిగారి చేతికర్ర తీసుకుని "ఎక్కడ— ఎక్కడ — ఎవడు?" అని పరుగెత్తసాగాడు— నౌకరు.

"ఎక్కడేమిట్రా నౌకరూ — ఏమొఖం నా ముఖమూనూ"

"ఐతే ఇక్కడేనా—ఇతనా .... కాదు, వీడా.... వీడా"

అంటూ మహాశయుణ్ణి మోదబోయాడు నౌకరు.

ధనవంతుడుగారు "ఆగురా" అని పెద్దకేక వేశారు—ఆకేకతోపాటు బయట ఏదో చప్పుడైంది. నౌకరువెళ్లిచూడగా, ఇంటిపైనవుండే నిక్షేపంలాంటి పాగగొట్టం ధనవంతుడికేకతో లేచిపోయి, దభీమని, కిందపోతున్న ఓజట్కాబండిమీదపడి దాన్ని విరగ్గొట్టింది! ఈగోలకు మరోనలుగురు భటులూ సేవకులూ పరుగెత్తుకొచ్చారు. మహాశయుడు మామూలుగా కూచున్నాడు.

"సోఫాక్రింద వెతకండి — సోఫామీదా వెతకండి" అని ఆర్డర్లు ఇవ్వసాగాడు ధనవంతుడు. నౌకర్లు వెతకసాగారు. మహాశయుడిని క్రిందకు ఈడ్చికూడా వెతికారు. కొంతసేపటికో తేలుపిల్ల దొరికింది!

"దాన్ని బైటకుతీసుకునిపోయి, పదిమంది మధ్య పెట్టి అవమానపరచి చిత్రహింసచెయ్యండి" అని హుకుంవేశాడు ధనవంతుడు. హాహాకారాలతో నౌకర్లు వెళ్లారు.

"గాలివాన వెలిసింది" అన్నాడు ధనవంతుడు.

"చిత్రహింస" అనుకున్నాడు మహాశయుడు, తేలునూ,ధనవంతుడి కుమారరత్నాన్నీ తలచుకుంటూ. ఈకుమార రత్నం—తండ్రిలక్ష్మిస్తే—రేప్పొద్దున్న చెయ్యబోయేదీ ఇదే!.... ఐనా తనామాట ప్రకాశంగా అనరాదు.

"నాటే క్లైమాక్స్" అన్నాడు మహాశయుడు 'ప్రకాశంగా' మారి.

"విన్నారా—సినిమా...."

"అదేఅదే, ఎవరుడైరెక్టరు?" అన్నాడు ఆత్రతగా మహాశయుడు.

"ఎవరు?.... అంటే?"

"అదే, అచిత్రానికి, అదే, సినిమాకి.. . అదే.... దర్శకుడు .."

"ఏదే దర్శకుడయ్యా?"

"అదే .. దర్శకుడు ... అదే, డైరక్టరూ"

"ప్చా! మళ్లీ అవేమాటలంటాడూ, తెలిసి చావనివయ్యా నాకూ"

"అయామ్‌సారీ, మీకుతెలీదు గావును. దర్శకుడనగా డైరక్టరు"

ధనవంతుడి వంటిమీద 'డమ్ముడు' కిరసనాయిలుపోసి, అంటించినట్టుగా మండిపోయాడు

"చీమలంటే పిపీలికంకాదూ!" అని కోపంగా చూశాడు.

"అవుననుకుంటానండీ. ఇప్పుడదెందుకు?"

"నీ మొఖమయ్యా— దర్శకుడెవరంటే డైరెక్టరంటావు. డైరెక్టరెవరు?.... దర్శకుడను మళ్లీ"

"మీకుతెలీదు. ఇంగ్లీషులో డైరెక్టరే తెలుగులో దర్శకుడు. కోప్పడకండి.... అనగా సినిమాకు సారథ్యం వహించేవాడూ, దాన్నిపట్టాలమీద నడిపించేవాడూనూ"

"అదే, నాకుమార రత్నమయ్యా అయితేనూ?"

"కాదు. మీకుమార రత్నం నిర్మాత. అనగా చిత్రం తీసేవాడు— ఐమీన్— తీయించేవాడు. తీసేవాడే దర్శకుడు."

"ఏమిటో సొద"

"సొదకాదు—యూమీన్, అర్థంకాకపోవడం"

"సరే, ఇంక ఈ పిడకలవేట ఆపి రామాయణంలో పడదాం. విను. ఐదులక్షలిస్తే మావాడు సినిమాతీస్తాట్ట. తియ్యనివ్వకపోతే తను చావటానికి గొయ్యేనా తీసుకుంటాట్ట" అన్నాడు ధనవంతుడు కోపంగా.

మహాశయుడునవ్వి — "అదేంమాటండీ, గొయ్యి అతన్ని తవ్వుకోనిస్తామటండీ, బోలెడంత డబ్బుగల మీకుమార రత్నం"

"నువ్వువాగక— ఇదివిను. అవ్వట్టు.... నువు మద్రాసులో ఇదివరకు ఏంచేసేవాడివి?"

"సినిమాలు తీశాను."

ధనవంతు డోసారి ఎగిరాడు. దూలం తగల్లేదు గాని, ఆగివున్న ఫాన్ తలకుతగిలింది—

"నెవర్‌మైండ్" అన్నాడు మహాశయుడు సీరియస్‌గా.

"వీళ్ల మొఖాలు ఈడ్వా—ఫాన్ తిప్పరేం?.... ఒరేనౌకర్లూ ఓరావాకర్లూ—ఈఫాను తిప్పరే మర్రా.... అదీసంగతి అందుకే గాలిరావటంలేదు, తిప్పండ్రా...." అని కేకలు వెయ్యసాగాడు ధనవంతుడు. ఒకచాకరూ ఇద్దరూ నౌకర్లూ ప్రవేశించి బలంఅంతా ప్రయోగించి, మీటనొక్కారు. ఆ బలానికి మీట జారిపోయి, తుక్కుతుక్కు అయిపోయింది. ఐతేనేం— పంకాతిరిగింది. ధనవంతుడు చూడకుండా ఆ మీటముక్కల్ని ఏరి, మోసుకుంటూ పోయారు వాళ్ళు.

"అయితే నువ్వు సినిమా తీశావూ—చెప్పవేం ఏంపెట్టితీశావు?"

"మామూలు డబ్బులే— ఐతే నావికావు. ఇతరులవి"

"ఇతరుల డబ్బులతోకూడా తియ్యొచ్చునా ఏం? చెప్పు చెప్పు"

"అల్లాపూరికే చెప్పనండోయ్. ట్రేడ్ సీక్రెట్స్— వ్యాపార రహస్యాలు. అన్‌లెస్ మీరు నన్ను దర్శకునిగా పెట్టుకుంటే.. . అఫ్‌కోర్సు."

"వుండుండు. ఆట్టే ఆమాటలుఅడకు. మావాడొస్తాడు." అన్నాడు ధనవంతుడు. అంటూనే —"నాయనా, కుమార రత్నం.... కుమార రత్నం అని పిలవసాగాడు.

తనూ ఓసారి "కుమార రత్నం" అని పిలిచి మహాశయుడుకూడా సహాయం చేశాడు

కుమార రత్నం ప్రవేశించాడు వస్తూనే— "ఏవి, ఐదేనా, ఇంకా ఎక్కువిస్తున్నారా— ఐదు చాలవు నాన్నా . పెద్దసెట్లూ, పెద్దతారలూ వుంటాయి. ఇంకో రెండోమూడో ." అన్నాడు ఆత్రుతగా.

"నువ్వు కూచో నాయనా— విషయాలు మాట్లాడదాం" అన్నాడు మహాశయుడు.

"ఐతే వెళ్లి ఆత్మహత్య ..." అని వెళ్లబోయాడు కుమార రత్నం.

"అబ్బాయ్, రత్నం! ఇటురా మాఅమ్మా వీరెవరో తెలుసుకో" అన్నాడు ధనవంతుడు.

"సినిమా డైరెక్టరును అబ్బాయ్" అన్నాడు మహాశయుడు, 'ఏమనుకున్నావోగాని' అనే భావంతో

రత్నానికి నమ్మకంకలగలేదు. కనీసం సిగరెట్టైనా కాల్చకుండా తిరుబడిగా కూచున్నవాడు సినిమా డైరెక్టరు ఎట్లా అవుతాడో అతనికి అర్థం కాలేదు. ఐనా— "ఏంతీశారు?" అన్నాడు.

మహాశయుడు చెప్పాడు.

"రత్నానికి నవ్వొచ్చింది. ఆపుకోటానికైనా ప్రయత్నించకుండా "ఓరి మీరా— ఫ్లాప్ డైరెక్టరా! మీరేనా మహాశయా?" అన్నాడు ఇంకానవ్వుతూ.

"ఇంక నీనవ్వు ఆపు. ఆయన చెప్పే వ్యాపార రహస్యాలు విను."

"అన్‌లెస్, నన్ను దర్శకునిగా తీసుకుంటేనే గాని—చెప్పను" అని సోఫామీదే మఠం వేసేసుకున్నాడు మహాశయుడు.

"మీరెందుకండీ, మిమ్మల్ని పెట్టుకోనండీ. నా దృష్టిలో ఒకాయన 'హిట్‌మేకర్' వున్నాడు ఆయనేవుండాలి." అని తేల్చాడు రత్నం

"అయితే వుంచుకో. అయ్యా, ధనవంతుడు గారూ, మీరు చిత్రం తియ్యవద్దు. అంటే, అతనికి డబ్బుల యివ్వొద్దు. ఏం లాభంలేదు" అన్నాడు మహాశయుడు.

"పోవయ్యా, బోలెడు లాభాలొస్తాయి" అన్నాడు రత్నం.

"నామాట వినండి. బోలెడంతడబ్బు నష్టం. సినిమాల్లో లాభాలు సంపాయిద్దామనుకునే, నేనూ దిగాను. కొంతమందిని దింపాను. అందరమూ అనుభవిస్తున్నాం" ధనవంతుడికి ఆశ ఏదో కలిగింది—

"ఐతే ఆ లాభాలు లేకపోవటమూ అందులోని సాధకబాధకాలూ మావాడికి వివరించండి. నేనూ వింటాను." అన్నాడు ధనవంతుడు.

"లాభాలు లేకపోవటం అంటే, కొన్ని లాభాలు లేకపోలేదు. అదే 'చిత్రలాభము' అనే కథను మీకు సవిస్తరంగా వినిపిస్తాను. విందురుగాక." అని, మహాశయుడు ఈవిధంగా చెప్పసాగాడు:

## చిత్రలాభము

"పూర్వము — అనగా ఒకప్పుడు — ఇంతకు పూర్వమూ అని. అనగా ఇదివరకు. అనగా మరీ 'అనగా అనగా' కాదు—ఒక్క 'అనగా' అనుకుందాం; టాకీ పుట్టెను. ముందు మామూలు మూకీ, తర్వాత టాకీ ఐకూచుంది. మూకీ అనగా టాకీ కానిది ...మీ కర్థం అవుతుంది ఇదంతా ఉపోద్ఘాతం అనిగాని, 'ఫోర్వర్డ్' అనిగాని అనబడును. అప్పుడు మూకీ....కాదు, అదే టాకీ ఐంది.. .ఇదంతా ఏమిటో నాకేగొడవగా ఉందికదూ, సినిమా పుట్టాక మద్రాసులోనూ చిత్రాలు తీశారు. చిత్రం తీసేందుకు నిర్మాతా దర్శకుడూ ముందు కుదరాలి; కుదురుకున్నారు. విశ్వాస్ అనీ బొంబాయి అతను, అతనూ నేనూ నలభై రెండులో అనుకుంటాను, కాదు, ముప్పై రెండులో .... కాదేమోలెండి, ముప్పై ఎనిమిది కాబోలు! సరే ఏదో, లతనూ నేనూ సినిమా తీదాం అని బయల్దేరాం. ఎక్కడికీ—కాఫీహోటలుకి. ముందు కాఫీ తాగాలిగా. అది లేకపోతే మనకప్పుడు మహా ఇబ్బందిగా ఉండేది. తర్వాతతర్వాత ఓవల్టిన్ తప్ప మరోటి కళ్లచూసేవాడినికాదు. కాఫీహోటల్లో కాఫీ తాగేశాం. నేను బిల్లు ఇస్తాననుకుంటాడు విశ్వాసు. అతనిస్తాడనుకుంటాను నేను. టోటలుకు ఎట్లా ఐతేనేం, ఇద్దరివద్దా డబ్బులులేవని, హోటలు వానితో చెప్పుకుని—ఆ రోజుల్లో పాపం ఊరుకునే వారు, వీధినపడ్డాం.

"బాగానే సినిమా తీశామే" అన్నాను నవ్వుతూ, జేబులో రూపాయితీసి సిగరెట్టు పెట్టెకని ఇస్తూ

"లేకపోతే ఎట్లా?" అన్నాడు విశ్వాస్ తనూ డబ్బులుతీసి చేతిలో పోసుకుని ఎగరేస్తూ. విశ్వాస్ చాలా సరదా ఐనవాడు. "హౌటూ ఓకే పిక్చర్?" అని అడిగేవాడు. నేను మామూలుగా కెమెరాలో ఫిల్ము లోడ్‌చేసి" అనేవాడిని. అతను నవ్వేవాడు నాలుగురోజులదాకా నన్ను 'జీ' అనేవాడు. నాలో అప్పుడు హాస్యరసం కూడా మిగతా జఠరరసం శరసం ఆరసాలతోపాటు ఉండేది. ఇప్పుడు అన్నిరసాలు గోవిందకొట్టేశాయ్, జఠరరసం మాత్రం 'ఫ్లడ్స్'లా ప్రవహిస్తోంది. ఇద్దరం కలిసి సముద్రతీరంలో కూచున్నాము. విశాలమైన సముద్రం, చల్లనిగాలీ, దూరంగా నీట్లో తేల్తున్న తెప్పలూ, మాకు కొద్ది దూరంలో కొత్తదంపతుల జంటా, సుదూరంలో వేరుసెనగకాయలు అమ్మే అబ్బి, వాడికి గజన్నరదూరంలో మిఠాయి అంటే మంచుమిఠాయి మనిషీ — ఎక్కడో కారుహారన్ల మోతలూ — ఇట్నే ఆనందకరంగావుంది. నాకు ఆలోచన్లమీద ఆలోచన్లు 'కెరటాల'వలె లేవసాగాయి. సినిమా కథలు అల్లసాగాను. కొంత సేపు పోయాక విశ్వాస్ వెర్రిగా నవ్వి లేచాడు.

"క్యామరాజ్!" అన్నాను

"లేవయ్యా. పద పోదాం, సినిమాలేదు గినిమా లేద మనతరంకాదు....లేలే"

# చిత్రలాభము

"ఇప్పుడు నేను లేవలేను సుమా. కథలు అల్లుకుంటున్నాను."

"ఐతే అట్లా అల్లుకుంటూ కూచో." అని గిరుక్కున తిరిగిపోసాగాడు. విశ్వాస్ వెళ్లిపోతే ఎట్లా? బస్సుటిక్కట్టుఖర్చు నాకు దండగవదూ! ఆగమని అరిచాను. విశ్వాస్ అట్లా మిడ్‌లోంచి మిడ్‌లాంగ్ లోకీ, లాంగ్‌లోకీ, లాంగ్‌లోంచి డిస్టెన్స్‌లోకీ పోయి డిసాల్వ్ ఐపోయినాడు. నేను లేచి పరుగెత్తాను. 'విశ్వాస్' అని అరిచాను. గంభీరమైన సముద్రం 'విశ్వాస్' అని ప్రతిధ్వనించింది! మళ్లీ అరిచాను. ఇంతలో ఒకతను "యారు?" అన్నాడు.



"విశ్వాస్"

"ఎంద విశ్వాస్?"

"నా ఫ్రెండ విశ్వాస్. వస్తా" అని వెళ్లిపోయి బస్సుస్టాండులో వెతికాను ఎక్కడా అతను కనిపించలేదు. ఏమైపోయాడో నా కర్థం కాలేదు. విశ్వాస్, లేకుండా నేనెట్లా సినిమాతియ్యను?

'నావిశ్వాస్' అనుకుంటూ బస్సెక్కి గదిచేరాను.

ఆగదిలో ఇంకో పదిమంది ఉండేవాళ్లు అంటే వున్నవాడు ఒక్కడే, కాని పదిమందిపెట్టు. ఒక్క కంఠంతో పదిరకాలుగా మాట్లాడేవాడు పదిమందితో పందెంవేసి ఒక్కడూ అంతకంటే ఎక్కువగా గోలచేసి గెలిచేవాడు. అతను హాస్యగాడు. సినిమాలో హాస్యవేషాలుగాని, హీరోలుగాని వేదామని అనుకునే వాడు. 'నేనుతీస్తే నీకిస్తాను' అనేవాడిని. అందుకని నన్ను తొందరగా సినిమాతియ్యమనేవాడు, లేకపోతే తనకు ఇబ్బందిగా ఉందట! అతను తమిళుడు. కాని, ఆంధ్రదేశంలో చాలాకాలం ఉండటంవల్ల తెలుగువాడల్లేనే ఐపోయినాడు. నేను వెళ్లేసరికి ముఖంనిండా రంగు పూసుకుని, మీసాలు అంటించుకుని విరిగిపోయిన అద్దంముక్కలో చూసుకుంటూ యాక్టు చేసేస్తున్నాడు.

"కట్" అన్నాను నేను వెళుతూనే.

"రీటేక్" అని తిరిగి ప్రారంభించబోయాడు.

"డోంటాక్, అయాప్ ఫైర్డ్"

"దెన్ రిఫైర్" అని తనసొద మొదలెట్టబోయాడు.

"ఆపవయ్యా యాక్షనూ" అని అరిచాను.

"మరెట్లాగయ్యా మహాశయ్యా! నువ్వేమో సినిమాతియ్యవు. తియ్యకపోతే మనకు వేరే పనిలేదు. ఈవిధంగా నేనే యాక్టుచేసుకుంటూ, దాంతో పాటే నా యాక్టింగుబొమ్మను తెరపై చూసినట్టుగా — వెంటనే చూసుకునేపద్ధతిని కనిపెట్టాను. కావాలంటే ఎక్కడన్నా ఏరుకుని నువ్వూ అద్దం ముక్కొటి తెచ్చుకో. ఇంకా కావాలంటే అందులో చూసుకుని, కట్ చెప్పు" అన్నాడు

"హాస్యంకాదబ్బాయ్, విశ్వాస్ కనిపించడం లేదు" అన్నాను.

"విశ్వాస్! విశ్వాస్! కనిపించడంలేదు! ఏమైపోయాడు? మూడింటికి చూసానుగా, నన్నో అణో అర్ధణో ఇమ్మంటున్నప్పుడు."

"అప్పుడు కాదు, ఇప్పుడు"

"ఐతే వాళ్ల ఊరెళ్లిపోయుంటాడు ఇక్కడ సినిమా తియ్యటం కాదనీ, అక్కడైతే అవుతుందనీ అన్నాళ్లే."

ఇట్లా ఏదో మాట్లాడుకున్నాం. ఆమర్నాడు, ఆమర్నాడూకూడా చూశాను. విశ్వాస్ కనిపించలేదు. నాకు ప్రపంచం అంతా గుండ్రంగాతిరగటం వృథా అనిపించింది. ఆగిపోతే బావుణ్ను అనిపించింది. మూడురోజులు గడిచాయి గదిలో ఆకలితో నాలుగు గ్లాసులనీళ్లు మింగి చాపగుడ్డమీద పొర్లుతున్నాను. బయట విశ్వాస్‌గొంతు!

"లేవోయ్ నాసామీ, మహాశయా, ఉఠో" అన్నాడు

"ఏమైపోయావు జీ, ఏమైపోయావు? నీకోసం ఎన్నెన్ని చోట్లలో ... ఎన్నెన్ని "

"ఆల్‌రైట్. ఒప్పుకున్నాం. నేను కనిపించలేదంటే, దానికి ఏదో కారణం ఉంటుంది ఆమాత్రం ఊహించుకోలేకపోయావ్"

"ఏం జరిగింది?" అన్నాను నేను ఆత్రుతగా.

"చెబుతా పద బీచికి పోదాంపట్టు" అన్నాడు.

'బీచికి అనగానే నాగుండె ఝల్లుమంది.

"అక్కడికి రాను. అయినా ఈఎండలో బీచికన్నా పార్కే బెటరు"

ఇద్దరమూ పార్కులో కూర్చున్నాము. విశ్వాస్ పెద్దరకం సిగరెట్టుకాలుస్తూ చెప్పసాగాడు:

(సశేషం)

కున్నాము. భయంలేదని కొంత భర
వసా ఇచ్చానుగాని ఆమె నామాట
చెవికెక్కనీయలేదు. త్వరగా వెళ్లి
నీసంగతి కనుక్కొని రమ్మని నన్ను
పంపించింది. నాలుగైదు రోజుల
నించి ఇక్కడే ఈ కొండశిఖరం
మీాదే కూర్చుని కళ్లు కాయలు
కాచేలా నీరాకకోసం ఎదురు
తెన్నులు చూస్తున్నాను ఏది
ఏమయినా ప్రాణాలతో బయట
పడ్డావు! మాకదే పదివేలు!"

హాయవాతా కతన్ని చూడగానే
మళ్లీ ప్రాణం లేచివచ్చింది. ముమ్ముం
దుగా తన విజయవార్త ఇయాగూ
చెవిని వేశాడు. ఆ తరవాత అతన్ని
ఒక చిక్కని మ్రిచెట్టునీడలో
కూర్చోబెట్టి జరిగిన సంగతి అంతా
పూసగుచ్చినట్లు చెప్పాడు. ఇయాగూ
అది వినగానే హాయవాతాని మళ్లీ
గాఢంగా కౌగలించుకుని అనేక
విధాల అభినందించాడు:

'నాయనా! నువ్వు మహా బల
శాలివే! సందేహంలేదు. కాని నీ
మెడలో వేలాడుతున్న రత్నరేకు,
నేనిచ్చిన మోచేతికవచాలు, పాద
రక్షలు విల్లమ్ములు నిన్ను కంటికి
రెప్పలా సంరక్షించాయి. వాటి
మూలాన నీకెక్కడలేని జవ
సత్వాలు వచ్చాయి తెలుసునా!'

ఆపైన హాయవాతా కొంత ఆలో
చనలో పడ్డాడు:

'అయితే ఈ మోచేతికవచాలు,
పాదరక్షలు, విల్లమ్ములు ఎక్కడివి?
న్యాయంగా నువ్వు తయారుచేసిన
వేనా?'

'కావు!'

'అయితే ఇవి ఎవరు తయారు
చేశారు?'

'మోచేతికవచాలు, పాదరక్షలు
నేనే తయారుచేయించాననుకో!

## హ య వా తా
## అద్భుతగాథ

31-వ పేజీ తరువాయి

కాని ఆ విల్లమ్ములుమాత్రం
ఇంకొకవ్యక్తి దగ్గిరనించి ఎత్తుకు
వచ్చాను! అతడు మన శత్రువుల
దేశం దకోటాలో నివసిస్తున్నాడు.
ధనుర్బాణాలు తయారుచెయ్య
డంలో అంతటివాడు మరి ఈ పృథి
విలో లేడు! ఒకనాడు అర్ధరాత్రి వేళ
ఈ పాదరక్షలు తొడుక్కుని అక
స్మాత్తుగా అతని ఇంటిలో ప్రవేశించి
కళ్లుగప్పి ఇవి ఎత్తుకు వచ్చాను.'

"మా కంపెనీలో పనిచేసే
ఉద్యోగుల మాటకూడా నా వీలు
నామాలో రాయండి. ఇరవై ఏళ్లు
పనిచేసిన ప్రతివాడికి రు. 50
వేలు ఇవ్వాలి" ఒకవ్యాపారస్థుడు
తన న్యాయవాదికి చెప్పాడు.

"మీారు చెప్పింది బాగానే
ఉంది. కాని మీారు వ్యాపారం
చెయ్యటం మొదలెట్టి పదేళ్లేగా
అయింది."

"ఆ సంగతి నాకు తెలియకనా!
అట్లా రాస్తే ఎంత 'అడ్వర్ టైజ్
మెంటో' ఆలోచించారా."

టి. చంద్రమౌళి (నెల్లూరు)

'అతని పేరు?'

'మకారియో'

'అలాగా! ఒక్కసారి అక్కడికి
వెళ్లి అతన్ని చూసివస్తాను.'

ఇయాగూ దాని కింతమాత్రము
అంగీకరించలేదు! అది శత్రువుల
దేశమని అక్కడ అడుగుపెడితే
మరి తిరిగి రావడం చాలా కష్టమని
హడంగొట్టాడు. కాని హాయవాతా
ఎక్కడ చెక్కుచెదరలేదు. అప్పటికి
అతనిదగ్గిర ఉన్న బాణాలన్నీ
అయిపోయాయి. అందుచేత అక్క
డికి వెళ్ళి మరికొన్ని బాణాలు సంపా
దించుకువస్తానని అన్నాడు కాని
ఇయాగూ దాని కంగీకరించలేదు:

'హాయవాతా! నీ కేమన్నా మతి
గాని పోయిందా? లేకపోతే ఏమిటీ
వెర్రి ధోరణి! అసలది శత్రు
వుల రాజ్యం! ఆపైన మకారియో
మన బద్ధశత్రువు! నేనతని కళ్ళు
గప్పి విల్లమ్ములు ఎత్తుకువచ్చాను.
ఇది జరిగినతరివాత నిన్ను చూడ
గానే 'నాయనా! వచ్చావా!' అని
ఎంతో ఆప్యాయంగా బాణాలందిస్తా
డనుకున్నావా? నిలువునా చీల్చి
వెయ్యడూ?అదీగాక మీా అమ్మమ్మ
నీ కోసం బెంగపెట్టుకుని చిక్కి శల్యా
మయిపోయింది! ఒక్కసారి ఇంటికి
వచ్చి నోకోమిస్‌ని పలకరించడం
న్యాయం కాదూ? అదీగాక ఇప్పుడి
బాణాలకింత తొందర ఏమివచ్చింది?
ఆపడమటిగాలిఓడిపోయి నీతో రాజీ
చేసుకున్నాడుకదా! తొందరపడకు!
నా మాట విను!'

హాయవాతా అది విని కొంతసే
పాలోచించి ఇయాగూని బ్రతి
మాలుకున్నాడు:

'ఇయాగూ! నువ్వు అన్నమాట
నిజమే! నేను తొందరతొందరగా
ఇంటికి వెళ్ళవలసిందే! కాని మొట్ట
మొదట మనరాజ్యం చక్కబెట్టు
కోవాలి. ఆపైన శత్రువుల గర్వం
అణిగించివెయ్యాలి. దీనికి అమ్ముల
పొదులు, బాణాలు, చాలా కావాలి.
కనక మాగుమాటాడక నువ్వు
ఇంటికి వెళ్ళిపో! నేను మకారియో
దగ్గిరకి వెళ్ళి నయానా భయానా
నచ్చజెప్పి బాణాలు కొన్ని సంపా
దించుకువస్తాను. నాకేమి భయం
లేదులే! పడమటిగాలినే జయించిన
వాడికి ఆ మకారియో ఒక

లేక్కా! ఇంటికి వెళ్లి నాకేమి భయంలేదని మా అమ్మమ్మతో చెప్పు! త్వరగానే తిరిగి వస్తానని చెప్పు! కాదు, కూడదని మరినన్ను బలవంత పెట్టకు!'

ఇయాగూ ఉసూరుమని ఒక నిట్టూర్పు విడిచిపెట్టి జాగ్రత్తగా ఉండవలసినదని మళ్లీ హాయవాతాని హెచ్చరించి మాటిమాటికి వెనక్కి తిరిగిచూస్తూ నోకోమిస్ భవంతికి ప్రయాణమయినాడు. 'అయ్యో! మకారియో సంగతి హాయవాతాకి ఎందుకు చెప్పాను.' అని లోలోపల ఎంతయినా పశ్చాత్తాప పడ్డాడు.

అతరవాత హాయవాతా అక్కడి నించి బయలుదేరి పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ కొంచెం పొద్దువాలిన తరవాత దకోటా రాజ్యంలో ప్రవేశించాడు. మరికొంతదూరం సాగిపోయిన తరవాత అతనికొక ఉద్యానవనం కనిపించింది. అది ఎవరిదని తనకి కనిపించిన ఒక వ్యక్తిని అడిగాడు. అతగాడది మకారియోదని సమాధానం చెప్పాడు. 'వెతకబోయిన తీగ కాళ్ళకే తగిలిందే!' అనుకున్నాడు హాయవాతా!

ఆ ఉద్యానవనంలో ప్రవేశించిన తరవాత మరి తనకళ్లే నమ్మలేకపోయాడు. దానిలో ఎక్కడ ఎండపొడకూడా పడడానికి వీలు లేనంత దట్టంగా పెద్దపెద్ద మామిడి చెట్లమీద రకరకాల రంగు రంగుల పువ్వుల తీగలు అల్లిబిల్లిగా అల్లుకున్నాయి. దానిమధ్యనించి ఒక పెద్ద సెలయేరు ఉరకలు వేస్తూ ప్రవహిస్తూంది. దానిలోనించి రంగు రంగుల చేపలు, పిట్టలు పైపై కెగిరి పడుతున్నాయి. లేళ్లు, జింకలు ఆ సెలయేటి ఇసకతిన్నెలలో చల్లని

# హయవాతా
# అద్భుత గాథ

చెట్లనీడలలో హాయిగా విశ్రమించాయి. హాయవాతా ఆ వింత అందానికెంతో నిర్ఘాంతపడి అలాగే చూస్తూ నిలుచున్నాడు. అలాగ ఎంతసేపు గడిచిందో అతనికే తెలియదు.

మరికొంత సేపటికి సెలయేటిలో ఏదో మెరుపు మెరిసినట్టయింది! హాయవాతా ఉలిక్కిపడి తిరిగిచూశాడు. ఎవరో ఒక అందకత్తె నిశ్చలంగా అతనివేపు చూస్తూంది. ఆమె శరీరకాంతి చుట్టూ రాఉన్న తీగలమీద బంగారు మలామా చేస్తూంది. కళ్లు రెండు మాత్రం కాటుకపిట్టల్లా నిగనిగలాడుతున్నాయి. నీలాలవంటి ముంగురులు కళ్లతో దోబూచులాడుకొంటున్నాయి. అంతలోనే పిల్లనగ్రోవి ఊదినట్టు తీయతీయగా వినిపిస్తున్న కంఠస్వరంతో ఆ అందగత్తె అడిగింది:

'ఎవరు నువ్వు?' ఎందుకు వచ్చావిక్కడికి?

'నా పేరు హాయవాతా! మాది ఈ దేశం కాదు. మకారియో నడిగి బాణాలు కొన్ని తీసుకుందామని వచ్చాను.'

'హాయవాతా? హాయవాతా? ఈ పేరు ఎక్కడో విన్నట్టుందే? అవును! జ్ఞాపకం వచ్చింది! మీరు మాకు శత్రువులు! మా ఉద్యానవనంలో అడుగుపెట్టడాని కెన్ని గుండెలున్నాయి నీకు? పో పో! వెంటనే వెళ్ళిపో! మా నాయనగారికిగాని నీ సంగతి తెలిస్తే మరి ప్రాణాలు దక్కవుసుమా! జాగ్రత్త!'

అయినా హాయవాతా భయపడలేదు! అల్లాగే నిశ్చలంగా ఆమె వైపు చూస్తూ చిరునవ్వులు చిలకరించాడు:

'పోతే పోనీ, ప్రాణం పోయినా నాకేమి భయం లేదు! నీవంటి అందకత్తెను కళ్లారా చూశాను! ఆహా! ఎంతటి అదృష్టవంతుణ్ణి! అయితే మరి నీ పేరు!'

'నా పేరు నీ కెందుకుగాని మా నాయనగారికిగాని నీ రాక సంగతి తెలిస్తే మరి జీవించడం కష్టంసుమా! నా మాట విను! తొందరతొందరగా వెళ్లిపో! వెళ్లిపో!'

అంతలోనే 'మిన్నెహాహా! మిన్నెహాహా!' అన్న పెద్దపిలుపు వినిపించింది! హాయవాతా అది విని 'ఆహా! ఎంత చక్కని పిలుపు! అదేనా? ని పేరు!' అన్నాడు. ఆమె అంతలోనే 'అదే నా పేరు! సరే దీని మాటకేం గాని వెళ్ళిపో! వెళ్ళిపో! మా నాయనగారికే వస్తున్నట్లున్నారు! మరి నీ ప్రాణాలు దక్కవు! వెళ్ళిపో! వెళ్ళిపో!' అని ఎంతో దీనంగా ప్రాథేయపడింది.

ఇంకా ఉంది

"ఇదివరకెప్పుడైనా జైలుకు వెళ్ళావా?" జడ్జి మృదువుగా నిందితుణ్ణి అడిగాడు.

"వెళ్ళలేదు బాబు!" నిందితుడు కంట నీరుపెడుతూ బొంగురు గొంతుతో సమాధానం చెప్పాడు.

"ఎందుకు ఏడుస్తావ్? ఈమారు వెడుదువుగానిలే" జడ్జి ఓదార్చాడు.

ప్రమీల (హైదరాబాదు).

మైన శిధభావాన్ని ఆమె మనస్సు ఒప్పుకోలా. ఆయన తమకన్నా బీదవాళ్లవటం ఆయన తప్పు కాదు. కాని ఆయనలో ఇంకేం లోటు ? విద్య, అందం, గుణం దేనికీ పేదతనం లేదు. మనిషి డబ్బుకు అంత విలువ ఎందుకివ్వాలి ?

రావుగారు ఏ విషయాల్లోనూ కల్పించుకొనే వారు కాదు. కూతురి మొహం ప్రఫుల్లంగా ఉంటే చాలు. ఆయన కింకేమీ అక్కర్లా.

మోహనుడు మూడవమారు వచ్చినప్పుడు, కాబోయే అల్లుడి ఈ ప్రవర్తన లలితమ్మగారిని కొంచెం చికాకుపరిచింది. కూతురిముందు అదే అన్నారు.

"ఇదేం బాగుందే ఇందిరా, పెళ్లికిముందే ఈ రాక పోకలు నాకేం బాగాలేదమ్మా."

ఇందిర మనస్సు చివుక్కుమంది.

"నాకోసం వస్తారమ్మా. తరువాత ఇక్కడికి ఎందుకొస్తారు చెప్పు ?"

"కాని చూసినవాళ్లు ఏమనుకుంటారు చెప్పు?"

"అమెరికా వెళ్లాక ఎలా వస్తారమ్మా ? దగ్గర ఉన్నారు కనుక వస్తున్నారు. ఆయనను నేను రమ్మని చెప్పలేదు. వస్తేమాత్రం రావద్దని అన లేను. ఏవిధంగాకూడా నే నాయన మనస్సు నొప్పించలేనమ్మా"—ఇందిర ఖచ్చితంగా చెప్పింది.

లలితమ్మగారు ఇంకేమీ అనలేకపోయారు.

ఇరుగు పొరుగు కాఫీతోటల యజమానుల అప హాస్యం ఆమె వ్యాకులానికి కారణమయింది.

కాబోయే అల్లునితో, "పెళ్లి జరిగేవరకు ఇలా రావద్దు" అని చెప్పనూలేకపోయారు.

మోహనుని ఆగమనం ఇందిరను ఆనందోత్సాహ లతో నింపివేస్తున్నా కూడా ఆమె అన్నిరకాలైన అలంకార ఆడంబరాలకు దూరంగానే ఉండేది.

సరళత, సహజతలే ఆమె లావణ్యం. నిష్కపట మైన ముఖంముందు ఎంతటి సౌందర్యమైనా కాంతివిహీనంగానే కనిపించేది.

మోహనుడు లేనప్పుడు ఎలాంటి సాదా దుస్తుల్లో ఉండేదో, అతన్ని ఎదుర్కొనేటప్పుడు కూడా అవే దుస్తులు ధరించేది.

కూతురి అలంకారం విషయంలో ఎంత ఆసక్తి వహించాలని లలితమ్మగారు ప్రయత్నించినా ఇందిర వినిపించుకునేది కాదు. నవ్వుతూ,

"అలంకారంతో ఎవ్వర్నీ కట్టెయ్యలేమమ్మా. స్త్రీ తన సౌందర్యంతో పురుషుడిని ఆకర్షించ వచ్చు. కాని ఆ ఆకర్షణ శాశ్వతమైనదికాదు. స్త్రీ సౌందర్యం దిగజారినట్టే ఆ ఆకర్షణా నశిస్తుంది" అనేది

"నీకేం చెప్పినా పెద్దగా పురాణం చెప్తావు" అంటూ విసుక్కున్నారు లలితమ్మగారు.

మోహన్ అమెరికా వెళ్లే తేది నిశ్చయమైంది.

రావుగారు అల్లుడితో బెంగుళూరు వెళ్లి అతడి ప్రయాణానికి, విదేశంలో ఉండటానికి అవసర మైన గుడ్డలూ అవీ కొనిపెట్టారు.

బెంగుళూరునుండి మోహనుడిని తమ ఊరికి తీసుకొని వెళ్లారు.

ఆ నాలుగురోజులూ ఇంట్లో నిత్యోత్సవంగా ఉంది. వెళ్లేందుకు ముందురోజు మోహనుడు ఇందిరతో కాఫీతోటలోకి షికారు వెళ్లాడు.

మితభాషిణియైన ఇందిర ఆరోజు అసలే

# వెండిమబ్బు

25-వ పేజీ తరువాయి

మాట్లాడలేదు. ఆమెవంతు మాటలుకూడా మోహనుడే మాట్లాడవలసి వచ్చింది.

"ఇందిరా, నిన్ను వదలి వెళ్లటానికి నాకు చాలా కష్టంగా ఉంది. కాని ఏంచేయను ? రెండే సంవత్స రాలు. తరువాత ఒక్క దూకులో నిన్ను చేరు కుంటాను. నిన్ను విడచి నే నెక్కువరోజులు ఉండలేను. నీకూ అలాగే ఉందనుకుంటాను ...."

మోహనుడి ఆఖరివాక్యం విని ఇందిర చిరునవ్వు నవ్వింది.

నేను దూరమయినా, 'వెండిమబ్బు' నీదిగా ఇక్కడే ఉంటుంది. "వెండిమబ్బు" పెంపకంలో నేను దగ్గరలేని దుఃఖాన్ని మరవడానికి ప్రయ త్నించు."

"వెండిమబ్బు' మీ ప్రతినిధి కాబోలు."

"అలాకాదు. వీలయినంతవరకూ తోటపనిలో నిమగ్నురాలివై ఉండమని చెప్తున్నా."

"ఏదీ మీరులేని లోటును తీర్చలేదు." వ్యథతో ఇందిర కంఠం వణికింది.

హాలీవుడ్ లో ఒక తారని ఊళ్లో సగంమంది పెళ్ళి చేసుకుందా మనుకుంటున్నారట; తక్కిన సగంమందికి ఆవిడతో ఎప్పుడో ఒకప్పుడు వివాహం జరిగింది.

పి. రాజారెడ్డి (విశాఖపట్నం)

మోహనుడు తన్ను చూచుకుని తానే గర్వ పడ్డాడు.

ఇందిరకు తనంటె ఎంత ప్రేమ !

"తల్లి, తండ్రి, వెండిమబ్బు, ఏవీ నన్ను మరి పించలేవా ఇందిరా ?"

"లేదు. ఏవీ మరిపించలేవు."

ఆమెమీద తనప్రభావం ఎంత గాఢంగా ఉందో తెలుస్తూనే ఉంది.

"అయితే ఓపని చేద్దాం. ఇప్పుడే పెళ్లి చేసేసు కుందాం. ఇద్దరం అమెరికాకు వెడదాం. ఏమం టావ్ ఇందిరా ?"—ఉత్సాహంగా అడిగాడు మోహన్.

"మీ చదువు?"

"ఎలాగో సాగుతుంది" అలక్ష్యంగా అన్నాడు మోహన్.

"ఊహుఁ. అలా అంటె కుదరదు. మీరు బాగా చదువుకుని ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులై రావాలి. అప్పుడే నాకూ తృప్తి. నాన్నకూ తృప్తి. మీ ఉన్నతిముందు నేను స్వార్థపరురాలినై అడ్డు రాలేను."

"ఐతే నేను ఒంటరిగా వెళ్ళక తప్పదా?"

"ఇంక వేరే దారేమీలేదు."

"వెళ్లేటప్పుడు కూడా ఇలా ఎండిన పెదవుల తోనే వెళ్లమంటావా?"

"ఒద్దు, ఒద్దు. కొబ్బరిబోండా, పానకం తాగి వెళ్లండి" ఉడికిస్తూ నవ్వింది ఇందిర.

కానుగచెట్టుక్రింద కూర్చున్నారు ఇద్దరూ.

"తరువాత ఇద్దరం ఎలాగూ దూరంగా ఉండక తప్పదు. ఇప్పుడూ దూరంగానే ఉండాలా ఇందిరా?"

ఇందిర బదులు పలకలేదు.

మోహనుడు లేచివచ్చి ఇందిర దగ్గరగా కూర్చు న్నాడు. ఇందిర బెదురుగా చుట్టూ చూసింది.

"చీకటిగా ఉంది. ఇక్కడి కెవరొస్తారు ? అంతగా వస్తే మాత్రమేం ? ఎప్పుడైనా మనం పెళ్లిచేసుకునే వాళ్లమేగా" అన్నాడు మోహన్.

"నిజమే."

"రేపు అందరి సమక్షంలో నేను నీకు వీడ్కో లివ్వాలి. నువ్వు ఇప్పుడే నాకు వీడ్కోలివ్వు."

"ఓ, అలాగే. వెళ్లిరండి మోహనరావుగారూ" అంది ఇందిర నాటకీయంగా.

మోహనుడు చిరుకోపం తెచ్చుకుని,

"ఇలాగే నేమిటి ? భలే బావుంది" అన్నాడు.

"మరెలా?"

"ఇలా .... " అన్నాడు మోహన్. అతని కౌగిట్లో కరగిపోయింది ఇందిర. ఆమె కళ్లనుండి ప్రవహిస్తున్న కన్నీటితో మోహనుని మొహం కూడా తడిసిపోయింది.

ఇందిర అనుకుంది.

....ఇతని ప్రభావం తనమీద వింతగా ఉంది.

కొన్ని నెలలక్రిందట అపరిచితుడైన ఈ యువకుడు తనమీద ఎంత విజయం సాధించాడు.క

కని పెంచిన తల్లికన్నా మోహనుడు ర్చి, బంధువులా అనిపిస్తున్నాడు.

తనకు అన్నివిధాల సౌకర్యాలనూ సమకూగద తన ఒక్క కన్నీటిబిందువుగాని, వాడిన మొహం గాని చూస్తే, వీలయితే మొత్తం లోకాన్నే తెచ్చివ్వగల తండ్రికన్నా మోహనుడు ఆమెకు ఆత్మీయుడుగా అనిపిస్తున్నాడు.

తల్లి ఒడికన్నా ప్రియమైన, చిన్నప్పటినుండి హాయిగా ఆడుతూ పెరిగిన 'వెండిమబ్బు' ను కూడా మోహనునికోసం వదలి వెళ్లడానికి ఇందిర సిద్ధంగా ఉంది.

అన్నయ్య, అక్క, చెల్లి, తమ్ముడు ఎవరూ లేకుండా ఒంటరిగా పెరిగిన ఇందిరకు ఏ కొరతా కనిపించనీయకుండా, మిత్రుల అభావం తోచనీయ కుండా పుట్టయ్య అక్కగా, అన్నగా, తమ్ముడిగా, చెల్లిగా అన్నిరూపాలు ధరించి ఇందిరను లాలించే వాడు.

మోహనుడు ఇందిరాసామ్రాజ్యాన్ని ఆక్ర మించాక ఇందిరకు పుట్టయ్య గుర్తుకువచ్చేవాడే కాదు.

అతనిగొంతు విన్నప్పుడు మాత్రమే గుర్తుకు వచ్చేవాడు.

తనకు ఎంతో ప్రియమయినవాళ్ల నందరినీ మోహనుడు తన చిటికెనవేలితో దూరంచేసి ఇందిర మనస్సును పూర్తిగా ఆక్రమించుకున్నాడు.

మోహనుడి కౌగిట్లో మైమరచిన ఇందిరకు దూరంనుండి పుట్టయ్య కంఠస్వరం వినిపిం చింది.

## వెండి మబ్బు

"అమ్మాయ్, అమ్మాయ్ ......"

ఆ క్షణంలో ఇందిరకు పుట్టయ్య తన శత్రువులా తోచాడు.

తన సుఖసంతోషాలకు ఇతడు అడ్డురావాలా?

"ఊరుకో, అరుచుకోసి"—అన్నాడు మోహన్ జుగుప్సతో.

"అమ్మాయ్, అడవిపంది ఇటు వచ్చిందట. జాగ్రత్తగా ఉండాలి .... వచ్చేసేయండి . .."

—పుట్టయ్య మళ్లీ గట్టిగా కేకేశాడు ....

మోహనుడికి ఏమైనా అపాయం కలిగితే ?

ఇందిర గబుక్కున లేచి మోహనుడి చేయి పట్టుకొని.

"రండి. వెడదాం" అంది.

ఇష్టం లేకపోయినా మోహనుడు లేచి ఇందిర వెంట నడిచాడు.

"ఉత్తరం వ్రాస్తావా ?"

"ఊ .... మీరు ?"

"నేనూ రాస్తాను."

"నన్ను మరవకండి ..... " ఇందిర కంఠం గద్గదమయింది.

"ఇవేం మాటలు ఇందిరా ? నిన్ను మరవగలనా ? నిన్నే మరిస్తే నా కెవరున్నారు ?"

"డబ్బు కావలసివస్తే సంకోచపడకండి. పరదేశంలో ఇబ్బందిపడకండి. ఎక్కువ శ్రమపడకండి. ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోండి. వారానికో ఉత్తరం తప్పకుండా వ్రాయాలి. నామీద ఒట్టు."

"వీలయితే ...." అని ఆగాడు మోహన్.

"వీలయితే ఏమిటి ?"

"నిన్ను నా కోటుమీది గులాబిపువ్వుగా మార్చుకొని వెళ్లిపోయేవాణ్ని."

తన దుఃఖాన్ని మరచి నవ్వింది ఇందిర.

చేతిలో టార్చిలైటుతో పుట్టయ్య ఎదురొచ్చాడు.

"త్వరగా పద ఇందిరా. అడవిపంది గుంపులోంచి తప్పించుకు వచ్చిందట."

మోహనుడు పరిహాసంగా

"ఏమిటి పుట్టయ్యగారూ, మీకు మీ అమ్మాయిగారి సంగతేగాని నా సంగతేమీ పట్టినట్టే లేదే?" అన్నాడు

"నాకేమో అమ్మాయి క్షేమచింతన. అమ్మాయికేమో మీ క్షేమచింతన. సరిపోయిందిగా"—అన్నాడు పుట్టయ్య

"అంటే మీరు పరోక్షంగా నా క్షేమచింతన చేసినట్టయింది. అంతేగా ?" అంటూ గట్టిగా నవ్వాడు మోహన్.

పునాది భద్రంగా ఉంటేకదా ఇల్లు సురక్షితంగా ఉండేది. వేరుకు నీళ్లుపోస్తే ఆకులు కళకళ లాడుతాయి. కాని ఆకులే చెట్టుకు శోభ. ఎండిపోయిన చెట్టు ఏంబాగు ?"

అంటూ పుట్టయ్య పాడుండబ్బీ బయటకు తీసి,

"మీరు వెళ్లండి నేను మెల్లగా వస్తాను" అన్నాడు.

ఇందిరామోహనులు మెల్లగా ముందుకు నడిచారు.

ఆమె కంట్లోనుండి కాఫీకాయంతే రెండు కన్నీటిబిందువులు జారి మట్టిలో కలిసిపోయాయి.

రాత్రి భోజనా లయ్యాయి.

ఉదయం కారులో కడూరు వెళ్లి అక్కడ నుండి పూనాఎక్స్‌ప్రెస్‌లో బొంబాయి వెళ్లటానికి నిశ్చయించారు.

మోహనుడితో రావుగారుకూడా బయల్దేరారు.

మోహనుడు విమానంలో అమెరికా వెళ్లాలని చాలా ఆశపడ్డాడు. కాని ఇందిర ఖచ్చితంగా చెప్పేసింది.

"నేను విమానంలో మిమ్మల్ని పంపించలేను."

మోహనుడు ఎంత వాదించినా లాభంలేకపోయింది.

విమానంలో వెడితే ఏం ?"

"ఎన్నో దుర్ఘటనలు సంభవిస్తూంటాయ్. నాకు భయం బాబూ."

"అలా చావటం నా నుదుటిలో రాసిఉంటె ఎవరు తప్పించగలరు ?"

"అలా అనకండి"—అని ఇందిర అన్నప్పుడు మోహనుడు విస్మితుడయ్యాడు

ఇందిర హృదయంలోని ప్రేమను కొలిచే శక్తి అతడికి లేదు.

చిన్నారి పాప లోతైన బావిలోకి తొంగిచూసి "చాలాలోతుగా ఉంది.చీకటి. సరిగ్గా కనపడటంలేదు" అనుకున్నట్లుగా ఉంది మోహన్‌కి.

రావుగారు కూతుర్ని బొంబాయిదాకా తీసుకు వెళ్లటానికి ఉత్సాహం కనపర్చారు. మోహనుడూ ఇందిర అంతదాకా రావాలని ఆశించాడు.

మర్నాడు అందర్ని పంపించి లలితమ్మగారు శూన్యమైన గృహంలోకి ప్రవేశించారు.

అందరూ బొంబాయి చేరుకున్న మరునాడే ఓడ బయల్దేరటానికి సిద్ధంగా ఉంది.

రావుగారు మోహనుణ్ణి తమ పరిచితుల ఇంటికి తీసుకొని వెళారు.

"నా అల్లుడు అమెరికా వెళ్తున్నారు"—అంటూ పరిచయంచేశారు.

మోహనుడి మిత్రులు, రావుగారు, ఇందిర అందరూ మోహనుడికి వీడ్కోలిచ్చారు.

ఓడ ఎక్కేముందు రావుగారు గులాబి పూల దండ తీసి,

"క్షేమంగా వెళ్లి లాభంగా తిరిగి రా" అంటూ అతని మెళ్లో వేయబోయారు

అంతలో మోహనుడి మిత్రుడు సఖారాం ఆయనను వారించి,

"రావుగారూ, దండ ఎవరు వేయాలో వాళ్లు వేస్తేనే అందం కాదూ ?" అన్నాడు.

రావుగారు అర్థపూర్ణంగా ఇందిరవైపు చూశారు.

ఇందిర సిగ్గుతో కుంచించుకుపోయింది.

ఎర్రబారిన మొహంతో "ఊహూ" అంది.

కాని సఖారాం అంతటితో ఊరుకుంటేగా !

"మీరు దండ వేస్తేగాని మోహన్ ఓడ ఎక్కడు" అన్నాడు.

మిత్రుల ఒత్తిడి ఎక్కువైంది.

ఇందిర వణికే చేతులతో దండ అందుకుంది.

మోహనుడు మెడ వంచాడు.

ఇందిరచేయి ముందుకు వచ్చింది.

మిత్రులు ఉత్సాహంతో చప్పట్లు కొట్టారు.

ఇందిర కంగారుగా హారం వేసింది.

కాని మాల అతని మెడలో పడకుండా భుజం మీద పడి కిందికి జారిపోతూఉంది. అంతలో మోహనుడు జారిపోయే దండ క్రిందికి పడకుండా అందుకుని తనమెడలో వేసుకుని ఇందిరవైపు చూశాడు. ఇందిర నవ్వడానికి ప్రయత్నించింది. కాని నవ్వు రాలేదు.

ఆమెకళ్లనిండా నీళ్లు నిండుకున్నాయి.

మిత్రులు పరిహాసం చేశారు.

దండ వేయించుకుని మాకు విందు చేయడం మరిచేవునుమా".

"రెండే సంవత్సరాలు"—మిత్రులతో అన్నాడు మోహన్.

ఇందిరవైపు తిరిగి బరువైన కంఠంతో అన్నాడు.

"రెండు సంవత్సరాలు."

స్టీమర్ కూత విని మోహన్ ఆత్రంగా అటువైపుకు బయల్దేరాడు వెడుతూ వెనుదిరిగిచూసి,

భార్య భర్తతో: "ఏమండీ ఒక ఇరవై రూపాయలు అప్పు యివ్వండి. జీతాలు రాగానే ఇచ్చి వేస్తాను."

వై. సాయిబాబా (గుంటూరు)

"ఉత్తరం వ్రాస్తాను"—అని కేకేశాడు. ఓడ కదలగానే ఇందిర తండ్రివైపు తిరిగి

"వెడదాం"—అంది.

డెక్‌మీద నిల్చున్న మోహనునివైపు చేయి వూపి వెనుదిరిగింది ఇందిర. ఓడ మెల్లగా కదలిపోయింది.

ఆరోజే రావుగారు కూతురితో చిక్కమగళూరు బయల్దేరారు. నవ్వుతూ కళకళలాడుతూ వెళ్లిన ఇందిర వాడినమొహంతో ఇంటికి రావటం చూసి లలితమ్మగారి హృదయం చివుక్కుమంది.

"వెండిమబ్బు" కు రాగానే ఇందిర అన్నంతిని చేతిలో కత్తి పట్టుకుని, మేకులున్న చెప్పులు తొడుక్కుని మండుటెండలో తోటలోకి బయల్దేరింది.

"ఇప్పు డెందుకమ్మా ?"—అంది తల్లి.

"ఆయనను మరవడానికి నాకున్న దారి ఇదొక్కటేనమ్మా."

"నీ హృదయంలో మోహనుడికి ప్రథమ స్థానం "వెండిమబ్బు" కు ద్వితీయస్థానం కదూ" అంటూ ఉడికించబోయింది తల్లి.

కాని ఇందిర మౌనం తల్లిమాట నిజమని నిరూపించింది.

* * *

మోహనుడి ప్రథమలేఖ సీడన్నునుండి ఎగిరి ఇందిరచేతుల్లోకి వాలింది.

కాబోయే భర్త ప్రథమలేఖ.

పోస్టుమేన్‌చేతిలోనుండి ఉత్తరం అందుకునేటప్పుడు ఇందిర ఆతురతతోబాటు కలవరపడింది.

ఎంతమంది అమ్మాయిలకు పెళ్లికి ముందు కాబోయే భర్తనుండి ఉత్తరాలు అందుకునే అదృష్టం పడుతుంది!

ఇందిర కొట్టుకుంటున్న హృదయాన్ని ఎడమ చేతితో అదిమి పట్టుకుని, కుడిచేతితో ఉత్తరం పట్టుకుని చదివింది.

"నా ఇందిరా .... !"

ఊం .... పెళ్లికి ముందే అతని ఇందిరట. ఎంత ధైర్యం అబ్బాయికి !

తరువాత మోహన్ తన క్షేమసమాచారాలు తెలిపాడు. ప్రయాణంలో తనతో కలిసిన మిత్రుల విషయం రాశాడు.

తరువాత విరహగీతం ఆలాపించాడు.

"ఇందిరా, నా జీవితచంద్రికా, వెలిగించు నా ఈ మందిరం. నీవులేని ఈ జీవితం నాపాలిటి చీకటి కుహరం ...."

చిరునవ్వు ఇందిర పెదవులమీద లాస్యం చేసింది.

"ఓ డార్లింగ్, డార్లింగ్ ...." అనుకుంది ఇందిర తనలోనే.

"నీ ప్రియ మోహన్"—అని పూర్తయిందా ప్రేమలేఖ.

ఇందిరహృదయం పులకరించింది. ప్రేమికులకు ఎల్లప్పుడూ వసంతమేనేమో ?

ప్రియుడి తొలి తుంపరలకు చాతకహృదయం వికసించింది.

ఆరోజంతా మోహనుడి ఉత్తరం చదవటంతోనే గడిపింది ఇందిర. రాత్రి 'ఎలా వ్రాయాలి, ఏమని వ్రాయాలి' అన్న యోచనతో సతమతమవుతూ నిద్రే పోలేదు.

పదిహేను రోజుల ప్రయత్న ఫలితంగా, నాలుగయిదు ఉత్తరాలు చింపేశాక ఆఖరికి ఒక ఉత్తరం వ్రాసింది.

" . . . . . . కి,

నమస్కృతులు.

నేను కవిని కాను. మీలా అంత మధురంగా నేను వ్రాయలేను. మీ క్షేమసమాచారాలు తెలుపండి.

మీ ఇందిర."

మోహనుడి ఉత్తరంముందు తన ఉత్తరం పెట్టి చూసింది ఇందిర.

అతి సామాన్యమైన చిన్న లేఖను చూసి ఆమెకెంతో సిగ్గనిపించింది.

ఆయన ఉత్తరం చదువుతుంటె సుందరం, మధురమైన కవిత చదువుతున్నట్లుండేది.

కాని తనది ?

అతి నీరసంగా, అతి సామాన్యంగా, గడ్డి కూడా మొలవని బంజరుభూమిలా ఉంది.

మోహనుడి ఉత్తరమో ?

వసంతమాసం సంధ్యాకాలంలో సగం విచ్చుకున్న మల్లెలతో నిండిన మల్లెతీగ.

# వెండిమబ్బు

కాని ఈ ప్రేమమల్లి వాడదు. క్రిందికి వ్రాలదు. నశించదు.

తనెంత భాగ్యశాలి !

కూతురికి కాబోయే అల్లుడినుంచి ఉత్తరం రావటం తల్లికి అసహనం కలుగజేసింది.

అంతలోనే కొంత సంతోషం.

మోహనుడికి తన కూతురిమీద ఎంత ప్రేమ ! దూరంగా ఉండేటప్పుడు ఉత్తరం వ్రాయకుండా ఉండలే డతను. పాతకాలపు అలవాట్లకు లోనైన ఆమె మనస్సుకు కష్టంగానూ ఉంది.

పెళ్లి కాకముందే ఈ ఉత్తరా లేమిటి ? వద్దని చెప్పటమెలా ?

మొత్తంమీద పెళ్లయిపోయుంటేనే బాగుండేది.

ఇందిరపెళ్లి అయిపోయిఉంటేనే బాగుండేదన్న చింత ఆమెను చాలా బాధ పెడ్తోంది.

చింతాగ్నిలో పడి ఆమెశరీరం కృశించిపోసాగింది రోజురోజుకూ ఆమె నీరసపడిపోతూ ఉంది.

తల్లిపరిస్థితి ఇందిరను చాలా కలవరపరిచింది. ఒక్కోసారి అనవసరంగా బాధపడుతున్న తల్లిమీద కోపమూ వచ్చేది.

తను నిశ్చింతగా ఉన్నప్పుడు తల్లి ఇంతగా ఎందుకు పట్టించుకోవాలి ? అన్నం, నీళ్లు వదలి బాధపడట మెందుకు ?

మంచంమీద ముడుచుకొని పడుకున్న తల్లిని ఇందిర పిల్చింది.

"అమ్మా, భోజనానికి రామ్మా."

"నాకు ఆకలిగాలేదే ఇందిరా. నువ్వు భోంచేసేయ్"

"ఊహు, నువ్వు తింటేగాని నేనూ తినను."

"నాకొద్దు."

"నేను తినాలని ఉంటే లేచిరామ్మా. మనిషి ఇంత చింత పెట్టుకోరాదు. దేనికైనా మితి ఉండాలి."

"ఏమిటో పెళ్లి చేసేసి ఉంటే బాగుండేది. నీపెళ్లి నా కళ్లతో చూడనేమో ?"

—అంటూ మూలిగిం దామె.

"పిచ్చిపిచ్చిగా మాట్లాడకమ్మా. రెండేళ్లు రెండు నెలల్లా గడిచిపోతాయి. ఆయన వెళ్లి అప్పుడే ఆరు నెలలు గడిచిపోయాయి. ఇక ఒకటి న్నర సంవత్సరాలు కళ్లు తెరచేంతలో అయిపోదూ? నువ్వూరికే బెంగెట్టుకోకమ్మా."

"పెళ్లిచేసి పంపితే ఎంత బాగుండేది !"

"మళ్ళీ అదేపాట. ఆయనలో నీకు నమ్మకం లేదామ్మా ? ఎన్నటికీ ఆయన మనకు ద్రోహం చేయరమ్మా. మనిషిపై అంత అపనమ్మక మయితే ఎలా చెప్పు ?"

"అతనిలో నమ్మకం లేదన్నానా ఏమిటే ? నీ పెళ్లి నేను చూస్తానో లేదో అని ...."

ఇందిరకు చాలా కోపం వచ్చింది.

"నీతో మాట్లాడి లాభంలేదు"—అంటూ లేచి వెళ్లింది.

ఒకవారం కాకముందే లలితమ్మగారి ఆరోగ్యం బాగా చెడిపోయింది. త్రాగిన నీళ్లుకూడా వాంతి అయిపోతూ వచ్చింది. నీరసంతో ఆమె మంచం పట్టింది.

ఇక ఆలస్యం చేస్తే లాభం లేదనుకుని రావుగారు ఆమెను కారులో చిక్కమగళూరు తీసుకొని వెళ్లారు.

కారులో వెళ్లేటప్పుడు గాలి తగలకుండా లలితమ్మగారు నీలం శాలువా కప్పుకొని సీటుకు ఒరగకొని కూర్చున్నారు.

తెల్లగా పాలిపోయిన మొహం, ఎండిన పెదవులు, చుట్టూ నల్లవారిన కాంతిహీనమైన కళ్లు, సగం నెరసిన వెంట్రుకలు, మోచేతిదాకా జారి పోయిన గాజులు—వీటిని చూసి ఆయన మనస్సు జాలితో నిండిపోయింది.

ఆయన ప్రేమతో ఆమె కప్పుకొన్న శాలువా సరిచేసి,

ఇప్పు డెలావుంది లలితా ?" అన్నారు.

"కొంచెం నయం"—అన్నా రామె భర్తను అధైర్యపరచడాని కిష్టంలేక.

"ఏవిషయమైనా అంతే లలితా. ఇంతగా పట్టించుకోకూడదు. ఇంత చిన్నవిషయాలనంతా పట్టించుకుంటూ పోతే మనం బ్రతకటం ఎలా? నాకూ అప్పుడే పెళ్లిచేయాలని ఆశగా ఉంది. కాని వాళ్లు చెప్పిందీ నిజమేగా. పెళ్లయ్యాక ఒక ర్నొకరు విడిచిఉండటం కష్టం. ఇందిరే అందుకు ఒప్పుకోలేదు. దాని మాటకు ఎదురుచెప్పేంత శక్తి నీ భర్తకింకా రాలేదు లలితా."

"అవునవును. మీ మాటలంతా నాదగ్గర్నే." మృదువుగా చీవాట్లుపెడుతున్నట్టు అన్నారు లలితమ్మగారు.

"ఆమాట నిజమే. నిన్ను నొప్పించగలను. కాని ఇందిరను ఎప్పటికీ నొప్పించలేను. తను ఎదురుగా లేనప్పుడు మనస్సును ఎంతో గట్టిపరుచుకుంటాను. కాని తను కనిపించేసరికి ఓటమి నాదే."

మీకు నాకన్నా కూతురే ఎక్కువ. కూతురుమీద ఉన్నంత ప్రేమ కట్టుకున్న పెళ్లాంమీద లేదు" అన్నారు లలితమ్మగారు.

"ఔను. కాని నువ్వు ఒద్దంటే ఇందిరను దూరం చేసుకొంటాను" అన్నారాయన చిలిపిగా.

"చాల్లెండి. అంతా నేను చెప్పినట్లే చేసే వాళ్లలా మాట్లాడకండి" చిరుకోపంతో అన్నారు లలితమ్మగారు.

తనకంటే ఎక్కువగా కూతుర్ని రావుగారు ప్రేమించటం ఒక్కొక్కప్పుడు లలితమ్మగారికి అసూయగా ఉండేది. కాని, ఇందిర ఎవరు ? తన కూతురు. లలితమ్మగారి హృదయం గర్వంతో పొంగి పోయేది. భర్త ప్రేమలో పాలుపంచుకునే ఇందిర తన కూతురు. ఈ పితృప్రేమ తీక్షణత మధురమైన నొప్పిని కలిగించే దామెకు.

ఇందిర దేవాలయం గోపురంలా, స్త్రీ చెవుల్లోని దుద్దుల్లాగా, కొలనులోని తామరపూవులా "వెండిమబ్బు"కు "మెఱుపుతార" గా మెరిసి పోయేది.

తల్లికన్నా తండ్రికి చాలా దగ్గరగా ఉండేది ఇందిర.

లలితమ్మకు కూతురిమీద ప్రేమ ఎక్కువేమీ కాదు. కాని కూతుర్ని ఎంత ప్రేమించినా, కోపం వచ్చినప్పుడు బాగా చీవాట్లు పెట్టేవాడు.

(పశేషం)

# హత్యామరణించదు!

24 వ పేజీ తరువాయి

మర్నాడు బిల్లీ పనికి వెళ్ళిపోయాడు. ఫ్రాంసెస్ తనకు జలుబుగా ఉందని పనికి వెళ్లలేదు. టెలిఫోన్ మీదనే సెలవుకోరింది.

సాయంత్రం గం 8—30 లకి ఇంటికి తిరిగివచ్చిన బిల్లీకి వంటఇంటిలో, ఫ్రాంసెస్‌శవం ఎదురయింది. గొంతుక కోసివుంది, తల పచ్చడి అయి ఉంది, ఒంటినిండా కత్తిపోట్లు కనిపించాయి. హత్యచేయటానికి వాడిన ఆయుధాలు పక్కనే పడిఉన్నాయి—ఒక పెద్దసుత్తి, వంటఇంట్లో వాడే కత్తి. (ఈకత్తి వాటర్స్ దంపతులదే.) ఇంటిలో దొంగతనం ఏమీ జరగలేదు. ఫ్రాంసెస్‌వాటర్స్‌ను ఎవరో బలవంతం చేయబోయి విఫలుడైనట్లు తెలిసింది.

శవపరీక్షచేయగా, హత్యజరిగి నాలుగు గంటలు మాత్రమే అయిఉంటుందని తేలింది. చుట్టుపట్ల ఇళ్లవారిని వాకబుచేసి పోలీసులు ఒకవిషయం తెలుసుకున్నారు; ఆరోజు బట్టలుఅమ్మేవ్యక్తి—సేల్స్‌మాన్—ఒకడు ఇంటింటికీవచ్చి అసభ్యంగా ప్రవర్తించాడుట. కొందరు స్త్రీలు తమతో అసహ్యంగా మాట్లాడినట్లు చెప్పారు.

మనిషిని ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా వర్ణించారుకాని అందరూ చాలాభారీవిగ్రహం కలవాడని అంగీకరించారు. అంతేకాక ఒకనీలం—తెలుపు రంగులు కల కారు నడుపుకుని రావటం అందరూ గమనించారు. వాటర్స్ ఇంటిముందు 4—30 గం. లకు ఇటువంటి కారు ఒకటి నిలిచిఉండటం కొందరు చూశారు.

పోలీసు అధికారులు యథావిధంగా పరిశోధనలు ప్రారంభించారు. హోటళ్ళు, మోటారుబళ్లను మరమ్మత్తుచేసే చోట్లు, లాడ్జిలు శోధించారు. అంతకుముందు స్త్రీలపట్ల ప్రవర్తన సరిగా లేనందున శిక్షననుభవించినవారి నందరినీ ప్రశ్నించి చూశారు. చుట్టుప్రక్కలనున్న అయిదు రాష్ట్రాల పోలీసుశాఖలవారూ నీలం—తెలుపు రంగులుకలకారు నడుపుతున్న ఒక భారీవ్యక్తికోసం వెతకటం మొదలుపెట్టారు. చాలాకార్లు నిలిపి విచారించారు ఎవరూ అనుమానింపతగ్గవారుగా లేరు.

కొన్ని వారాలు గడిచాయి. నెలలుకూడా గడిచాయి.

## శ్రద్ధవల్ల కలిగే లాభాలు

తమవద్ద విలువైన సమాచారం ఉందని తెలియని సాక్షులద్వారా చాలా 'కేసులు' ముగిసిపోతూ ఉంటాయి. మే నెలలో, (అంటే హత్యజరిగిన మూడునెలల తర్వాత), వాటర్స్ ఉంటున్న పేటలో తిరిగి విచారణలు జరుపగా ఒక ఆధారం లభించింది

ఆ దినం సాయంత్రం కారులో షికారుకెళ్లి వచ్చిన ఒకకుటుంబంవారు తమయింటికి ఒక యువకుడు వచ్చి టెలిఫోన్ వాడినట్లు గుర్తుకి వచ్చి పోలీసు అధికారులకు తెలిపారు. ఇంటిలోకి వచ్చినతర్వాత అతను లోపల మనుష్యులు చాలా మంది ఉండటంచూసి ఎందుకో సందేహించి బయటకు వెళ్లిపోయాడు. అతని నీలం—తెలుపు కారు వెంటనే స్టార్టుకాక కొంచెం ఇబ్బంది కలిగించటం ఇంటివారికి గుర్తువచ్చింది.

ఆ యువకుని వర్ణన వివరంగా చేశారు: ఆరడుగులపైన పొడుగు, 200 పౌనులపైన బరువు, బంగారురంగు జుట్టు, బలిష్ఠమైన శరీరం. ఈ వర్ణన ఆధారంగా రూపం వూహించి ఒక చిత్రాకారుడు బొమ్మగీశాడు. హంతకునికోసం వేట మళ్లీప్రారంభమయింది. అయినా ఎవరినీ అరెస్టుచేయలేక పోయారు.

నీలం—తెలుపుకారు అన్వేషణ వేరే జరుగుతూనే ఉంది. జూలై నెల ఆఖరుకిగాని ఏరకమయిన సమాచారము తెలియలేదు. గోల్డ్‌స్‌బరోకి 40 మైళ్లదూరంలో ఉన్న అయ్‌డన్ అనేవూరు. హైస్కూలుకారు ఫిబ్రవరిలో ఎవరో దొంగిలించినట్లు పాతరికార్డులవల్ల తెలిసింది. ఈకారు నీలం— తెలుపు రంగు కలది.

ఆస్కూలు ఫుట్‌బాల్‌టీములో లైన్‌మాన్‌గా ఉంటున్న కెన్నెత్‌జాలీ — వయస్సు 16, ఎత్తు ఆరడుగులు, బరువు 240 పౌన్లు—తమ కారు తీసుకుని ఇంటినుంచి పారిపోదామని నిశ్చయించుకుని తర్వాత మనస్సుమార్చుకుని తలిదండ్రులతో తనొకకారు దొంగిలించి ఎక్కడో వదిలివచ్చేసినట్లు చెప్పానని ఒప్పుకున్నాడు. అతనికేసు విచారణకూడా జరిగింది. నేరంచేసినట్లు అంగీకరించి అతని తలిదండ్రులు కోర్టులో జరిమానాకూడా చెల్లించారు.

ఇది 24—2—61 న జరిగింది. అంటే ఫ్రాంసెస్‌వాటర్స్ హత్యజరిగిన మర్నాడు. జాలీబట్టలమీద రక్తం మరకలు కనిపించాయి. తనముక్కులోనుంచి కారిన నెత్తురు, అని అతను చెప్పాడు అప్పుడు.

## నిరాకరణయొక్క పరిణామం

కెన్నెత్‌ని అరెస్టుచేశారు. అతను తన నేరం ఒప్పుకున్నాడు. తను ఇంటివద్దనుంచి పారిపోదామని నిశ్చయించుకున్న తర్వాత డబ్బు అవసరం గుర్తించి, సేల్స్‌మాన్ నాటకంవేసి దొంగతనం చేద్దామని అనుకున్నానన్నాడు. మిసెస్ వాటర్స్ డబ్బు ఇవ్వటానికి నిరాకరించగా ఆమెను వంటఇంట్లోకి తరిమి అక్కడేఉన్న కత్తి, సుత్తి ఉపయోగించి ఆమెను చంపేసినట్లు చెప్పాడు.

ఆగస్టు 15, 1961 న జాలీ హత్యానేరారోపణకి ఒప్పుకున్నాడు. యావజ్జీవన కారాగార శిక్ష విధించారు. కాని కేసులో సాక్ష్యం 'స్టేట్ పెరోల్ బోర్డు' (State parole Board) తన వశం చేసుకుని శిక్షవ్యవధి తగ్గించవచ్చు.

మిసెస్ ఫ్రాంసెస్‌వాటర్స్ హత్యజరిగి నేటికి సంవత్సరం దాటింది. కాని, హంతకుడిని ఏమి చెయ్యాలీ అనే ప్రశ్న ఇంకా గోల్డ్‌స్‌బరోలో చర్చిస్తూనే ఉన్నారు.



# విడి విడని చిక్కులు

23-వ పేజీ తరువాయి

ఎంత పొద్దునో అటువంటి సందర్భంలో మాట్లాడడమూ అంతే వచ్చును.

ఆమె తన పోర్షను తెలీకుండా రంగంమీదికి వచ్చిన నటిలాగ ఉంది సూర్యం మాటాడలేదు ఆమె ప్రశ్నకు జవాబు కూడా యివ్వలేదు.

మీనాక్షే తిరిగి మాటాడింది.

"అమ్మొమ్మగారు నీకు వడ్డించి .... జాగ్రత్తగా తినిపించి, మరీ తనకి గ్లూకోజు ఇమ్మన్నారు .... " మీనాక్షి చెప్పింది నవ్వుతూ.

అది విని సూర్యం మెట్లు దిగిపోయేడు. భోజనాలగదిలోకి సరాసరి వెళ్లి కూచున్నాడు మీనాక్షి అన్నం కంచంలోకి తోడుతున్నది సుమారు సగంవరకూ గమ్మరించి . . అతగాడు పరధ్యానంలో ఉన్నాడని గ్రహించి ఊరుకుంది.

ఆమెకి యే వస్తువు యెక్కడ ఉందో తెలియదు. అది సరే .... అందులోకీ మడివస్తువులు తాకకూడదు కూడాను.

రాజ్యలక్ష్మి నీడలా వచ్చి గుమ్మంలో నించుంది.

"అదోటక్కా ! అదే నెయ్యి ! .... అదే కంది పొడుం .... అదేమో మాయిలావకాయ" వేళ్లతో చెప్పింది.

మీనాక్షి సూర్యంవిస్తట్లో ఆవకాయ తీసి వెయ్యబోయి .... చెంచాతోసహా ఆ ముక్కని క్రింద జార్చేసింది.

"నాకేం వద్దు మీనాక్షి . . . మజ్జిగ పొయ్యి !" మన్నాడు సూర్యం. రాజ్యలక్ష్మి కేసి తిరిగి "నీకేమన్నా విలువు జీతం ఇచ్చేరా? దేవిడీమన్నావా? ఇలారా" అన్నాడు.

మీనాక్షికి స్త్రీసహజమైన అహంకారం దెబ్బ తిన్నది జీవితంలో మొదటి పర్యాయం ఇంత తికమకలు గాభరాపడుతూన్నదంతా వృధా !! ....

ఆపిల్ల నిలబడడం అన్నమాట ఇతగాడికి బాధ ?" అని నొచ్చుకుంది.

"నువ్వు ఇలా వచ్చి వడ్డించ"మంది రాజ్యలక్ష్మిని చూసి.

"సరిపోయింది .... మజ్జిగ పొయ్యి .... ఆ పెంకి పిల్లని రమ్మంటే కంచంలో మాని ఒళ్లో పోస్తుంది .... నువ్వే నయం, నేలపాల్చేసేవ్ ఆవకాయ." సూర్యం నిర్మలంగా హాస్యం ఆడినా మీనాక్షి నొచ్చుకుంది.

"మజ్జిగ కాదక్కా పాలు అలవాటు" అంటూ రాజ్యలక్ష్మి వారించింది.

"మీనాక్షి నవ్వింది" "సరిపోయింది. మరీ అంత పరధ్యానమా ?".... రోజూ ఏం తింటావో నాకేం తెలుస్తుందీ చెప్పాలిగాని" . .. అంటూ పాలు తెచ్చి పోసింది.

"నువ్వుకూడా భోజనానికి కూర్చో అక్కా . నే వొడ్డిస్తా"నంది రాజ్యలక్ష్మి. సూర్యం ఉలిక్కిపడి "మరి నిర్మల భోజనం ? వంట యెవరు వండుతారు వాళ్ల యింట ?" అన్నాడు

"నిర్మలక్కయ్య ఇవాళ భోజనం చెయ్యదుట శనివారమని" మీనాక్షికి పీట వేస్తూ చెప్పింది రాజ్యలక్ష్మి.

మీనాక్షి ఆపిల్లకి ఆయింట ఉన్న చొరవనీ, చనువునీ అధికారం అనుకుని ఆశ్చర్యపడింది.

"ఒద్దు ఒద్దు . నేమా ఈ పూట శనివారమే .... పాలుతాగి పడుకుంటా .... నువ్వు వెళ్లి ... ఆవిడను పాలు తాగుతారేమో కనుక్కోనిరా" అన్నది

"ఎందుకూ . నువ్వు అన్నం తిను. నిర్మలకి నేను ఏవో పళ్లు తీసికొస్తా" నన్నాడు .సూర్యం.

ఆడపిల్లల మనస్సు లెంత సున్నితమైనవో చెప్పడం కష్టం. సూర్యానికింకా ఏమీ తెలీదు

మీనాక్షికి మనసు చివుక్కుమంది సూర్యం తన నింత నిర్లక్ష్యం చేస్తాడని బాధపడింది

"నేను తిననం" ది కోపంగా.

సూర్యం బజారుకెళ్లే ప్రయత్నంలో గబగబా అన్నంజుర్రుతూ "సరే ! ఏపిల్సు తెస్తాలే" అన్నాడు

"ఏంవండీ! నరసింహంగారిని చూడాలనివచ్చాను. చూడచ్చా?" టీకుటాకుగావచ్చిన వ్యక్తి వార్డు నర్సును అడిగాడు.

"క్షమించండి! ఇప్పుడు వీలు కాదు."

"పోనీ ఆయన కెలాఉందో మీరే చెప్పండి."

"ఆయన చాలా కులాసాగా ఉన్నారు. మరేం దిగులుపడకండి."

"రక్షించారు! అదే నాకు కావలసింది. వారం రోజులుగా వార్డులో పడుంటే నా మొహం చూసినవాళ్లులేరు. ప్రాణం విసుగుపుట్టి ఇట్లా వచ్చాను. నేనే నరసింహాన్ని."

పి. ఎల్. రావు (మచిలీపట్టణం)

"మా ఊళ్లోనూ దొరుకుతాయ్ ఆపిల్సు .... ఐ డోంట్ వాంట్ !"—మీనాక్షిమాటలకి సూర్యం ఏదో అనబోయి ఊరుకున్నాడు

"నువ్వు వెళ్లు రాజా ! మీ పిన్ని బడితె పూజకి, సిద్ధమయ్యే ఉంటుం దీపాటికి" అన్నాడు.

రాజ్యలక్ష్మి మారుమాటాడలేదు.

"మీనాక్షి ! నువ్వు లేకపోతే యివాళ యేమయ్యేదో ? నిజంగా నిన్ను ఆ దేవుడే ఉంచేశాడు" అన్నాడు సూర్యం అవతలికి వెడుతూ కృతజ్ఞత తన మాటల్లో వ్యక్తపరుస్తూ

"థాంక్స్ ! . . నువ్వు ఏపిల్సు తేవద్దుగాని .... గ్లూకోజు తీసుకురా ఉదయం నిర్మల తెచ్చింది పాపం !" అన్నది.

ఆమెమొహం కొంచెం వికసించింది.

"నేను ఎంగిలి ఎత్తేస్తాగాని నువ్వు కొంచెం పాలు ఆ గ్లాసులోకి తీసి .... మిగతావి పోదు వెయ్యక్కా" అంది రాజ్యలక్ష్మి.

మీనాక్షి రాజ్యలక్ష్మి చెప్పినట్లే చేసింది

"అయితే నువ్వు పిన్నిగారింట్లో ఉంటున్నావన్నమాట " అనడిగింది

తలూపింది రాజ్యలక్ష్మి.

మీనాక్షి నరసమ్మగారి మంచందగ్గరికి వచ్చి "మీకు నిజంగా చాలా శ్రమ యిస్తున్నాం ... ఇవాళ భోజనం చెయ్యనిమాట నిజమా ? లేపోతే నా వంట తినడం యిష్టంలేదా ?" అన్నది.

"మంచివారే మీరు ! ... నాకు ఒంటిపూట ఇవాళ .... దురదృష్టం, లేపోతే మీచేతి పాకం తిందునా ?" అని నవ్వింగి నిర్మల "పోనీ రేపు" తింటా నన్నది వెంటనే

"నేనుంటాలెండి . మా బావ వచ్చేలోపున మీరు మీ యింటికి వెళ్లి పనేమైనా ఉంటే చూసుకొని రాండి .... తర్వాత మన మిద్దరం ఫలహారం చేద్దాం ... అమ్మొమ్మగారికి బహుశా స్లీపింగ్‌పిల్ కాబోలు యిచ్చేడు డాక్టరు"

"అయ్యో ! మాష్టారిని నాకోసరం పళ్లు తెమ్మని పంపేరా ! యెంతపని జేసేరండీ . ." అని నొచ్చుకుంది నిర్మల.

"అక్కా ! నువ్వు అమ్మొమ్మగారి దగ్గరేకదూ పడుకుంటావ్ ?" నిర్మల నడిగింది రాజ్యలక్ష్మి, పట్టెల్లు తలుపు వేసుకుని వచ్చి.

"ఔను . . . ఎందుకంటే ఒకవేళ . . . రాత్రివేళ పిలుస్తారేమోనని .. " అని నిర్మల, మీనాక్షి అనుమతి కోసరమా అన్నట్లు ఆమెకేసి చూసింది

నిర్మల మాటలకి మీనాక్షి సంతోషించింది. "థాంక్స్" అంది. "ఆ రెండు మంచాలు ఇలా పట్టవూ మంచిదానివి" అని నిర్మలకీ, తనకీ, రాజ్యలక్ష్మి సాయంలో మంచాలు వేసింది

"మరి బావ ?" రాజ్యలక్ష్మికి మీనాక్షిమీద కోపం వచ్చింది. ఆ కోపంలో దురుద్దేశంలేదు. కేవలం సూర్యానికి ఇబ్బంది కలగడం ఆపిల్లకి ఇష్టంలేకపోవడమే.

నిర్మల నవ్వింది

"డాబామీద" అన్నది వెటకారంగా.

"మంచు పడుతుందేమో ?"రాజ్యలక్ష్మి అమాయకత్వానికి మీనాక్షి విస్తుపోయింది. కొంచెం అసూయ చెందింది కూడాను

"పడుతుంది . . . నరి డాబా అంటే ఏమిటి ?" అని నవ్వింది

నిజానికి ఆవేళ రాత్రి సూర్యం డాబామీదే పడుకున్నాడు

"బామ్మ లేస్తే పళ్లు తింటుందేమో యిస్తారు కదూ" అన్నాడు బతిమాలుతున్నట్లు, డాబా యెక్కిపోతూ నిర్మలనీ, మీనాక్షినీ ఉద్దేశించి

మీనాక్షి నవ్వుతూ "ఊహుం మేం తినేస్తాం" అంది

నరసమ్మగారు మధ్యమధ్య "రామా" అంటూ మూలిగినా, ఆమెకి పూర్తిగా నిద్రపట్టింది.

నిర్మలకి కునుకులేదు. మీనాక్షికి కలత నిద్దర పట్టింది రాజ్యలక్ష్మికి లలితాంబ దెబ్బలతో ఒళ్లు ఉలిసి నిద్రపట్టింది.

ఆపిల్ల నిద్దట్లో యేడ్చినా పంచభూతాలు వినావినే దిక్కులేకపోయేరు.

# 31

ఉదయం లేచిం తర్వాత రాజ్యలక్ష్మికి మామూలు చాకిరీ తప్పదు గనుక, ధ్యానమంతా అటే వర నమ్మగారి ఇంటిమీదనే ఉంచి పనులు చేసు కుంటున్నది.

"దిక్కుమాలిన పీడ ! నిన్నంతా వాళ్లింట చచ్చింది. ఈ చాకిరీకి జీతమో నాతమో యేర్పాటు చేయించండి .... ఇక్కడ మెక్కి అక్కడ చాకిరీ చేయడమేమిటీ ?" అన్నది భర్తతో లలితాంబ భోజనందగ్గర. అతగాడు కిక్కురుమనకుండా ఉద్యోగానికి పోయేడు.

అదే సమయంలో అడావుడిగా, లలితాంబగారింటికి చుట్టాలు వచ్చేరు. ఆ ఇద్దరూ మూర్యానికి గుమ్మంలో యెదురయ్యేరు.

మొదట, మూర్యం "ఆఫీసుకి పోయి శలవు పెట్టి వస్తా" నన్నాడు.

నిర్మల మీనాక్షి ఇద్దరూ వారించేరు.

"సరే అయితేనూ .... హోటల్లో భోజనం చేసి పోతా .... నీకు వంట అడుదుం బుడుదుం చేయడం రాదేమో ?" నన్నాడు.

మీనాక్షి ఉడుక్కుంది. "ఇంకా నయం .... అన్నం తినడం రాదన్నావ్ కాదూ ?" అన్నది. "వెళ్లి స్నానంచేసి రమ్మం"ది .... అప్పుడే వంట ముగించేసి వడ్డనకి సిద్ధమయినట్లు !

కాని మూర్యం, "మధ్యాహ్నం వచ్చి బామ్మని చూసి భోజనంచేసి వెడతావండు" మని అవతలికి వెళ్లిపోయాడు.

* * *

నరసమ్మగారికి మక్క యింకా సాఫీగా రాలేదు. జ్వరం దాదాపు నార్మల్‌కి దిగింది.

బయటకు వెళ్తున్న మూర్యం, గుమ్మంలో ఇద్దరు స్త్రీలు ముఖ్యంగా ఇద్దరూ వితంతువులే యెదురవడం, కొంచెం అయిష్టంగానే యెదుర్కొన్నాడు.

ఆ యిద్దరిలోనూ ఒకామె ముందుతరం విధవ... గుండూ, పైన పంచే. రెండో ఆమె రంగుచీర ధరించి కుంతలాలు ఉంచుకున్నది. ఆ ఇద్దరూ మూర్యాన్ని భోగట్టాచేసేరు. మూర్యం లోపలికి సంకేతించేడు. "అలా వెళ్లండి" అని

లోపల, లలితాంబ ఆ ఇద్దర్నీ సంబరమంత సంతోషంతో యెదుర్కొన్నది.

"రాండి, రండి. క్రిష్ణవేణమ్మత్తయ్యా! రా, రా, సావిత్రొదినా !" అంట్రూ మాతిదగ్గర్నుంచి సంరంభంగా వచ్చి ఇంట్లోకి తీసికెళ్లింది.

"అదేవిఁటే పిల్లా ? అంత అర్జెంటుగా రా అంటూ రాస్తివి ఉత్తరముక్క ?". అన్నది క్రిష్ణవేణమ్మ. మూట నక్కడ పెట్టి ఉస్సురని చతికిలబడి "ఇంత కాఫీ పొయ్యి . స్నానంచేసి వంట వండుకుంటా" నంది

సావిత్రి కింకా నలభై సంవత్సరాలు నిండ లేదు కృష్ణవేణమ్మ "పోండుతా" నంటే వెంటనే

"చచ్చేం వాగుడ్ను గూట్లోకొస్తాయి నీన్నీ" అన్నది—

"అయితే విధవముండవిగదా ? .... నైవేద్యం పెట్టుకోవూ ?" అని అడిగింది కృష్ణవేణమ్మ ఆక్షేపణగా.

లలితాంబ ఆ ఇద్దరికీ కాఫీ ఇచ్చింది

"నాకా కప్పు ఒద్దు...నుబ్బరంగా, కంచుగళాసులో పోసెయ్యి" మంది కృష్ణవేణమ్మ. "అలాగే" నంది లలితాంబ నవ్వుతూ.

లలితాంబ పూర్తిగా మాటల్లోకి దిగిపోయింది. సావిత్రమ్మ లేచి రాజ్యలక్ష్మిని "నుయ్యి చూపించవే పిల్లా !" అంటూ స్నానానికి నడిచింది.

రాజ్యలక్ష్మి సావిత్రిని దిగబెట్టి తిరిగివచ్చి కొత్త మునలమ్మను ఆసక్తితో చూస్తూ నుంచుంది.

లలితాంబ చంటిదానికి పాలు కుడుపుతూనే రాజ్యలక్ష్మిని ఉరిమిచూసింది. "నువ్వెందుకే గబ్బిళం ! పో అవతలి" కంది. లలితాంబ మాటలను వింటూనే కృష్ణవేణమ్మ రాజ్యలక్ష్మిని అసహ్యంగా చూసి "ఎంతమాట ?" అన్నది గుండెమీద చెయ్యివేసుకుని.

:

"ఇదిగోనోయ్! నేసివనిముట్టు కొనుక్కొచ్చా చూశావా.ఇహ నుంచి వినిపించదనే బాధ ఉండదు." బ్రహ్మానందంగారు 'హియరింగ్ ఎయిడ్' భార్యకు చూపిస్తూ సంబరపడ్డారు.

"హమ్మయ్యా! ఎనిమిదేళ్లగా చెబుతుంటే ఇప్పటికి మీా తలకెక్కింది." ఆమె కూడా ఆయన సంబరంలో భాగం పంచుకుంది.

"ఒహ్హా! నువ్వు రోజూ చెబుతున్నది దీనినంగతేనన్నమాట." బ్రహ్మానందంగారు విరగబడి నవ్వారు.

బి. వెంకటరమణ (నిడుబ్రోలు)

రాజ్యలక్ష్మి మునలమ్మ జుగుప్సను ఖాతరు చేయలేదు. 'పొమ్మన్నదే చాలు' నని నరసమ్మ గారింటికి వెళ్లిపోయింది.

లలితాంబ రాజ్యలక్ష్మికి ఆ మూడుముళ్లా మెపీ "పీడ" వొదిలించుకోవాలని దీక్ష పట్టింది ఈమధ్య ఆమెకి ఆ విషయంలో మరింత ఆరాట మెక్కువయ్యింది.

కృష్ణవేణమ్మ నివ్వెరపాటును తాను గమనించనట్లు నటించి "ఇది మనకు దక్కేట్టు లేదు ఇక ఆ మూడుముళ్లూ వేయించాలి అన్నారు వాళ్ల చిన్నాన్నగారు .... లాపోతే నీకు అంత యిదిగా రాస్తానా అత్తయ్యా ?" అన్నది అసలు విషయం లోకి సూటిగా దిగుతూ.

"అది సరేగాని పిల్లా !" అని మొదలెట్టింది కృష్ణవేణమ్మ ఆమె అర్ధోక్తిలో ఆగడం, ఆమె చూపులతీరూ, లలితాంబకి యేమో తెలియని సంశయాన్నీ, ఆందోళననూ కలిగించేయి.

"నీకు తెలుసనుకోను .... తెలిస్తే యెవరిదగ్గ రేనా దాస్తావ్‌గానీ నా దగ్గిర దాచవుగదా ?" అన్నది మరింత ముందుకి జరిగి కృష్ణవేణమ్మ. ఆమె దృక్కులలో, నేరం ఋజువుచేసే న్యాయాధిపతి చూపుల తీవ్రత ఉన్నది.

లలితాంబ గాభరా దాచుకోలేకపోయింది. "అదేమిటత్తయ్యా ?" .... అని ఆటుతర్వాత ఏమీ అన లేకపోయింది.

"ఈ పిల్ల నీ తోడికోడలుబిడ్డే నంటావ్ ?" కృష్ణవేణమ్మ ప్రశ్నతో బొమ్మబారిపోయింది లలితాంబ.

"నీ కేమేనా పిచ్చా ? యేమిటి అత్తయ్యా ! ఇదేమిటీ ? విడ్డూరపు మాటలూ !" అన్నది.

కృష్ణవేణమ్మ విశ్వాసంగా తల పంకించింది. లలితాంబ తన దగ్గర, యేమీ దాచలేదనీ, ఆమె అమాయకత్వంమీద భరవసా ఏర్పర్చుకున్నది.

"నువ్వేమనుకుంటే అదే అనుకోగాని పిల్లా ? ఇదీ ఉన్నమాటా, విన్నమాటానూ" అంటూ ఇసింటా జరిగింది కృష్ణవేణమ్మ.

"ఈ పిల్లనీ, నీ తోడికోడలు పెంచుకుందిట!" అన్నది చెవులో గుసగుసగా ....

విస్తుబోయింది లలితాంబ.

"అంతేకాదు. ఈపిల్ల జాతి మాలిందట !! .... మహాలక్ష్మి, ఓ కాపు దాని దగ్గర అప్పత్రిలో తెచ్చుకుందిట ?! ...."

కృష్ణవేణమ్మ కళ్లింతలేసి చేసుకొని ఆయాస పడుతూ చెప్పింది.

"అయ్యో ! నాకేందారి ? ఎంతపని జేసేవ్ అత్తయ్యో !! ఏ నూతులో పడుదునేవ్ !!" అంటూ గుండెలు బాదుకుంది లలితాంబ.

కృష్ణవేణమ్మ అవతల్నించి సావిత్రి రావడం గమనించి, లలితాంబనోరు నొక్కినంతపని జేసింది.

"నవ్వుతారు గాని నోరు మూసుకో" మంది.

లలితాంబ నోరు నొక్కుకొని లేచి "ఇదో మీకు వంటకు నాలుగూ అందిస్తా" నని వంట యింట దూరింది

ఐతే ఆమెకి మనస్థైర్యం సడలిపోయింది. భర్తమీద · అతగాడి "పేగులు చీల్చేద్దామా ?" అన్నంత ఒళ్లు మండిపోయింది. "ఎంత దగా ? ఎంత మోసం!!" అనుకుంది రాజ్యలక్ష్మిని పీక పిసికేద్దునా ? .... "తన జాతినీ, నీతినీ మంట గల్పింది పాడుపిల్ల" అని తెగ విసుక్కుని, మండి పడుతూ పోపుల డబ్బా తిరగదోసింది పొయ్యిలో నీళ్లు పోసింది

ఇదంతా, సావిత్రమ్మ గ్రహించకపోలేదుగాని ఆవిడ కడుపులో ఆత్మారాముడి గగ్గోలుముందు ఈ లలితాంబ చిత్తక్షోభ నీగిపోయింది

కృష్ణవేణమ్మకూడా స్నానంచేసి వచ్చింది. వంటకి ఉపక్రమించింది మధ్యలో అవకాశం దొరికినపుడల్లా ఆమె సావిత్రికి అందని సంకేత పదజాలంతో, లలితాంబకి సాంబశివంగారి గత చరిత్రను తాను సేకరించిన మేరకు అందిస్తూనే ఉన్నది

"విన్నావుటే ? లలితా ! మీ తోడికోడలు అప్పు

త్రితో ఉన్నప్పుడు—మావూరి జమదగ్నిగారి కోడలు వేంకటమహాలక్ష్మమ్మ అదేవార్డులో ఉందిట" అని ఒకసారి "అప్పుడే ఇక మీ తోడి కోడలికి తనకింక పిల్లలు కలిగే భాగ్యం ఉండదని నమ్మకంగా తోచిందట" అని మరోసారీ, ఈవిధంగా ఆమె సంభాషణ సాగించింది

లలితాంబకి, కృష్ణవేణమ్మమాటలు గుండెల్లో పిడుగుల్లా తగులుతున్నాయి ఆమెకి భర్తమీద విశ్వాసంగాని, రాజ్యలక్ష్మిమీద జాలిగాని రాలేదు అయినా సావిత్రిముందు తన పరువు ప్రతిష్ఠలు సర్వ నాశనం అవడం ఇష్టంలేదుగనుక లోపల లోపలనే మండిపోసాగింది

"అత్తయ్యా! మొదట నువ్వు ఎంట . . . పాపం, యేవేళ వనగా విన్న మధ్యాహ్నం గుప్పెడు మెతుకులు తిన్నారో మీరు" అన్నది అవసరం లేక పోయినా నూతి దగ్గరకి వెళ్ళిపోయింది.

## 32

సూర్యం శలవుకాగితం చూసి శంకరం గారు ఆశ్చర్యం ప్రకటించేరు

"ఔనండీ! మా బామ్మ పడిపోయిందండీ!" అన్నాడు సూర్యం

"సాయంకాలం నేనూ వస్తాను, చూసి వెళ తాను ఆశ్చర్యపడకు దేవునిమీద భారం వెయ్యి వెళ్ళు . . వెళ్ళు . " మన్నారు శలవు గ్రాంటు చేసి మళ్ళీ వెనక్కి పిలిచి "అన్నట్టూ, మీ యింట్లో వంట యెవరూ?" అని అడిగేరు

"మా మేనమామ కూతురున్నదిలెండి" అన్నాడు సూర్యం

శంకరంగారు మాటాడలేదు

సూర్యం వెడుతూ రీటాతో చెప్పేడు "ప్లీ!

# విడీ విడని చిక్కులు

సారీ! మిస్టర్ సూర్యమ్ . . ." అని, సానుభూతి ప్రకటించింది రీటా

మంగపతి అప్పుడే వస్తూ "ఏం గోపాలుడూ! తాళాలు వేస్తున్నారేం! ఏం కథ?" అన్నాడు సూర్యం ఒళ్ళు మండించుకుని, ఇంగ్లీషులో నే"నేను వెళ్తున్నా" నన్నాడు

మంగపతి ఉలిక్కిపడి, తనప్రక్కగా దూసు కునిపోయిన సూర్యాన్ని కళ్ళజోడు తీసి, సందు మలుపు తిరిగేదాకా పరికించి, తన సీట్లోకి వెళ్ళి పోయేడు

సూర్యం అదే దారిలో డాక్టర్ని కలిసికొని అతగాణ్ణి వేగరపెట్టి కూడా యింటికి తీసుకొచ్చేడు

డాక్టరు ఇంజక్షను యెక్కిస్తూ "మిస్టర్ సూర్యం! యీమె దగ్గిరేనా మీరు చిన్నతనం నుంచి పెరిగేరు?" అన్నాడు. ఆ ప్రశ్నకి కారణం సూర్యంలో నరసమ్మగారి గురించి, హద్దుమీరిన ఆందోళన కనపడడమే "ఔనండీ! మా బామ్మే నండీ నా కంతాను" అని సూర్యం యింజెక్షను యిస్తున్నపుడు, బామ్మకేసి చూడలేదు అటు మొహం తిప్పేసుకున్నాడు

"డోంట్ వరీ! . . షియీజ్ ఓ కే . . . నొప్పి రెండు, మూడు రోజులుంటుంది . . . యెంతైనా ఓల్డ్ యేజ్ కదూ?" అన్నాడు డాక్టరు

డాక్టర్ని సాగనంపి వచ్చి సూర్యం నరసమ్మగారి మంచంమీద కూచున్నాడు

నరసమ్మగారు ఆప్యాయంగా తన చెయ్యి అతగాడి ఒళ్ళో ఉంచి "ఆఫీసుకి శలవు పెట్టేవురా?" అన్నది

తలూపేడు.

"పాపం నిర్మలని యిబ్బందిపెట్టడం యిష్టం లేదే నాకు" అన్నాడు సూర్యం బామ్మ చేతి వేళ్ళను లెక్కిస్తున్నట్లు తన కుడిచేత్తో తాకుతూ.

"పేరుకుదగ్గ నైజంరా ఆ పిల్లది . . భగవంతుడు మరి ఎందుచేతను చల్లనిచూపు చూపేడు కాదో తెలియదు"—

నరసమ్మగారి మాటల్లో, ఆమెకు యీ రెండు రోజుల్లోనూ ప్రత్యేకంగా నిర్మలమీద కలిగిన సానుభూతీ, వాత్సల్యం, ద్యోతకం కాగా, సూర్యం ఆనందించేడు

అంతలో మీనాక్షి వచ్చి "ఇదుగో గ్లూకోజు . . . ఆవిణ్ణి మాటాడించొద్దు . నువ్వు కాఫీ తాగుతావా?" అని సూర్యాన్ని అడిగి, నరసమ్మగారికి చెంచాతో గ్లూకోజు పట్టడానికి ఉపక్రమించింది.

"నే పడతానులే" అన్నాడు సూర్యం ముందుకి ఒంగి మీనాక్షివద్ద గ్లాసందుకోబోయాడు

"అక్కర్లేదు పోవయ్యా" మీనాక్షి చనువుగా విదిలించింది

సూర్యం అదోలా ఐ అక్కడ్నుంచి దూరంగా వెళ్ళి కుర్చీలో కూచున్నాడు

నిర్మల వచ్చి "ఎలా ఉందండీ? బామ్మగారికి" అన్నది మీనాక్షి నుద్దేశించి

"రావే తల్లీ రా! నీ చలవే ననుకో . నాకు యింకా మావాడిని ఓ యింటివాడిని చేసే ఆయువుంది" అంటూ నరసమ్మగారే పలకరించింది.

ఆమె మాటలకి సూర్యం, మీనాక్షీ, నిర్మలా, ముగ్గురూ అదోలా సిగ్గు నభినయించేరు ఎవరూ సమాధానంగా పెదవి విప్పలేదు.

(సశేషం)

---

మానులు కాలేజీ వార్షికోత్సవాలకోసం ఎదురు చూడటంకూడా కద్దు. నాటకాలలో పాత్రధరించే విద్యార్థులు గ్రూపులుగా చీలిపోయి, అరడజను నాటికలను తయారుచేసి ఆ మూడురోజులూ ప్రదర్శించటం—అక్కడి సంప్రదాయం

రెండేళ్ళనుంచి విద్యార్థినులుకూడా ముందుకు వచ్చి నాటకాలలో వేషాలు వేయటం— రోడ్డు సైడు రోమియోలకూ—ఆడపిల్లలను ఏడిపించాలనే ప్రత్యేకాభిమానంగల పోకిల్లా విద్యార్థులకూ—ఈ అయిటం ఒక ప్రత్యేకాకర్షణ

ఆడపిల్లలు మొదటిసారిగా వేషంకట్టి స్టేజీ మీద తిరిగినప్పుడు ఆ ఏడు కుర్రకారంతా పిల్లి కూతలూ, గుర్రపు సకిలింతలతోనే సరిపుచ్చారు మరింతగా గొడవచేస్తే ఆడపిల్లలు బెదిరిపోయి యిహ నాటకాలకు నమస్కారంచేసి, పుస్తకాలు పట్టి పరీక్షల్లో ఫస్టుక్లాసులు సంపాదించడంలో మునిగిపోతారని— ఆడపిల్లల తండ్రులకు లగి సంతోషంకల్గించే విషయం అయి వుండవచ్చుకానీ మగసజ్జు తండ్రులుమాత్రం— ఆ ప్రక్కింటి లతనుగానీ. లేకపోతే ప్రక్కవీధి శ్యామలనుగానీ ఫస్టుక్లాసు తెచ్చుకున్నందుకు అభినందిస్తూ— తమకు పెట్టగడ్డిని భరించి నమలటం ఒకవిధంగా దుర్భరం కాబట్టి— ఆఏటి విద్యార్థులు అంతగా

# వార్షికోత్సవం

17—వ పేజీ తరువాయి

బరితెగించలేదని కొంతమంది ఉద్దేశ్యం ఏది ఏమయినప్పటికిని ఆ ఏడు అంతగా అల్లరి జరగ లేదనేదిమాత్రం ఖాయమయిన విషయం

ఇహ రెండవసంవత్సరం కొస్త గడుసరి కుర్రకారు ప్రవేశించి — కాలేజీ వార్షికోత్సవాలలో మూడవరోజును అంటే ఆడపిల్లలు నాటికను ప్రదర్శించేరోజును, దీపావళి పండుగగా భావించి బాణాసంచా కాల్చి— చూడవచ్చిన ప్రేక్షకులనే కాకుండా, స్టేజీమీదున్న పాత్రధారిణులను కూడా హడలగొట్టేశారు ఏ కాకరపూవొత్తులో, వెన్నెల మడుగులో కాల్చినట్లయితే ఎవరికీ అంతగా ఇబ్బంది ఉండకపోయేది కానీ కుర్రవాండ్లు ఆరోజు 'బాంబుల పండుగ' చేసుకున్నారు. పాపం — స్టేజీ మీదున్న అమ్మాయిలు నోరువిప్పి ఏదో డైలాగుచెప్ప బోవటం— 'ఢాం' మని ఎక్కడినుంచో బాంబు ప్రేలడం — తళుక్కున ఫ్లాష్‌బల్బు మొహాలమీద మెరవటం—వారు ఉక్కిరి బిక్కిరి అయి వచ్చిన డైలాగు కొస్త మరిచిపోయి మే—మే మనటం

ఈ రభసంతా ప్రక్కగా కూర్చునివున్న ఆడపిల్లలకు— తమజాతికి జరుగుతున్న అన్యాయానికి బాధకల్గింది— కానీ ఏం చేయగలరు?

విద్యార్థిలోకంమాత్రం (కొద్దిమంది తప్ప) సంతోషసముద్రంలో మునిగిపోయి, ఈ ఘన కార్యాన్ని నిర్వర్తించిన ఘనులను శ్లాఘించి— పుష్పమాలాలంకృతులను చేయలేదు కానీ— జేజేలు పలికింది.

క్రిందటి సంవత్సరం ఆడపిల్లల నాటిక ఆవిధంగా రసాభాసయింది. ఈ సంఘటన విద్యార్థినులలో తీవ్ర సంచలనాన్ని రేపింది

నాటకాలకు స్వస్తిచెప్పి వార్షికోత్సవాలలో అసలు అంటించుకోకుండా విద్యార్థినులు వుంటారనుకొని అంచనాలు వేసిన కొంతమందికి తీవ్రమయిన ఆశాభంగం కలిగింది. ఆడపిల్లలలో పట్టుదల పెరిగి — ఈసారికూడా వార్షికోత్సవాలలో ఎటువంటి జంకూ లేకుండా పాల్గొనాలని —తమ పౌరుషం నిరూపించుకోవాలనే జిగీష వారిలో పెరిగింది శిరీష నాయకత్వంలో వారికి కావాల్సిన అన్ని హంగులూ పూర్తి అయినవి. చిన్న నాటకాన్ని కష్టపడి తయారుచేశారు ఆఖరి రోజున ప్రదర్శించడానికి

గిరీశం ఆ ఏడు కళాశాల డ్రెమటిక్ అసోసియేషన్ సెక్రటరీగా అత్యధిక మెజారిటీతో

ఎన్నికయ్యాడు. విరుడు జరిగిన రభనంకు బాధ పడిన కొద్దిమందిలో అతనొకడు. వార్షికోత్సవాలు ఎటువంటి గొడవా జరుగకుండా విజయవంతం కావాలంటే — ఆడపిల్లల నాటకానికి పర్మిషన్ ఇవ్వకుండా ఉండటమే మంచిదని అతని ఉద్దేశ్యం. ఆరోజు నాటకంలో వేషంకట్టిన ఆడపిల్లలు తమకు జరిగిన అవమానానికి కళ్లనీళ్లపర్యంతం అయితే — గిరీశం మనస్సు కలుక్కుమంది. సిగ్గుతో తలవంచుకున్నాడు సోదర విద్యార్థుల గొప్పపనికి—

శిరీష ఆడపిల్లల ప్రతినిధిగా అఏటి యూనియన్‌కు ఎన్నుకోబడింది— తాము అవమానింపబడినామనే పౌరుషంతోనూ, విద్యార్థులకు బెదిరితే ఇంకా లోకువ అవుతామనే ఉద్దేశ్యంతోనూ, నాటిక తమతరఫున వేయటానికి నిశ్చయించుకుంది. పైగా అందులో ఒక ముఖ్యపాత్రను నిర్వహించటానికి నిశ్చయించుకుంది గూడా—

గిరీశం తనదగ్గరికివచ్చిన ఆడపిల్లలకు అన్ని విషయాలూ సవిస్తరంగా తేటతెల్లం చేశాడు. నాటిక ఆడపిల్లలు వేయకుండా ఉంటేనే మంచిపనీ— గొడవలను ఆపటం కష్టమయినపనీ— ఒకవేళ ఏమయినా అల్లరులు సంభవిస్తే— అప్పుడు చేతులుకాలినతరువాత ఆకులు పట్టుకోవడం— అర్థంలేని పనీ '

అసోసియేషన్ బ్యానరుక్రింద వేయటానికి పర్మిషన్ తీసుకోవటానికి వచ్చిన విద్యార్థినుల ప్రతినిధివర్గం గిరీశం మాటలను అర్థంచేసుకోకుండా అపార్థాలు తీసింది. శత్రుకూటమి అయ్యాడనే పదాయితో అట్లా ప్రవర్తిస్తున్నాడని — శిరీషకు మారిపోశారు.

అంతకుముందు జరిగిన ఎలక్యూషన్ కాంపిటీషన్లో 'ఆడవాళ్ళకి సమానహక్కులూ— ఆదర్శాలను' గూర్చి అద్భుతంగా మాట్లాడి బహుమతిని కొట్టేసిన గిరీశం ఉపన్యాసానికి విపరీతార్థాలు తీసి— ప్రైజుకోసం పడిన పాట్లని— ఈసడింపులో పక్కున నవ్వుకున్నారు. మొదట శిరీష నమ్మలేదుకానీ — ఇప్పటి గిరీశం ప్రవర్తనను చూసి నమ్మక తప్పిందిగాదు.

కళ్ళు మూసుకొని ఏదో ఆలోచిస్తున్న గిరీశాన్ని కాలేజీ ప్యూను వచ్చి తట్టి 'మిమ్మల్ని ప్రిన్సిపాల్ గారు పిలుస్తున్నారు' అనేకబురు అందజేశాడు. గిరీశం బడలికగా 'వస్తున్నాను పద' అని అతని వెంబడి ప్రిన్సిపాల్ గదిలోకి దారితీసాడు.

గదిలో ప్రిన్సిపాల్‌గారు శిరీషతో ఏదో మాట్లాడుతున్నవాడల్లా ఇతన్నిచూసి రమ్మన్నట్టుగా సైగచేశారు.

ఫ్యాను చల్లటిగాలికి గిరీశం శరీరం కాస్త తెప్పరిల్లింది. ఉల్లాసంగా ఉండటానికి ప్రయత్నం చేస్తూ ప్రక్కనేఉన్న శిరీషవైపు చూశాడు. ఆమె అతనివైపే చూస్తున్నది.

ఫిర్యాదుచేసి తీర్పుకోసమని ఎదురుచూస్తున్నట్టుగా వున్నాయి ఆమె చూపులు.

కాసేపు ఎవరూ మాట్లాడలేదు. ఫ్యాను 'బర్రు' మనే శబ్దమే అక్కడినిశ్శబ్దాన్ని భంగపరుస్తున్నది.

రెండునిముషాలయినతరువాత ప్రిన్సిపాల్ తలెత్తి 'మిస్టర్— గిరీశం' అన్నారు.

'వాట్ సార్!' అన్నాడు గిరీశం.

ప్రిన్సిపాల్ చిన్నగా నవ్వి— 'నీకు తెలుసనుకుంటా శిరీష ఎందుకు నావద్దకు వచ్చిందో'— అన్నాడు.

గిరీశం బుద్ధిమంతుడిలా తలవూపాడు.

'మరి కాలేజీ బ్యానరుక్రింద వాళ్ళ నాటకాన్ని వేయనీయకుండా ఉండాలనే నీ ఉద్దేశ్యం నాకు బోధపడలేదు — ఏదో అబ్జెక్ట్ చేస్తున్నావట' చాలా నెమ్మదిగా మాట్లాడాడు ప్రిన్సిపాల్.

మీ కింకా జ్ఞాపకముందనుకుంటా — విరుడు జరిగిన రభసంతానూ మన కాలేజీ విద్యార్థులు ఆహ్వానింపబడిన గెస్టుల్ముందర తిరిగి ఇంకొకసారి అవమానింపబడటం — కాలేజీకి అప్రదిష్ట సార్—అదిగాక ఏదన్నా జరిగితే లేడీస్ నొచ్చుకోవటం —పెద్ద న్యూసెన్సు సార్!' కొద్దిగా ఆవేశంగా మాట్లాడాడు గిరీశం.

"మనిద్దరం అనుభవించిన మధురక్షణాలు మర్చిపోలేను!" అతడామెతో అన్నాడు.

"ఏం డైయిరీలో రాసుకున్నారా?"

"డైయిరీ దేనికి? చెక్ స్టబ్బులు చాలవూ".

జె. జయరాం (తెనాలి)

'ఈఏడుకూడా ఆ విధంగానే జరుగుతాయని మన మెందుకు అనుకోవాలి?' ఎదురుప్రశ్న వేశాడు ప్రిన్సిపాల్.

గిరీశం మాట్లాడలేదు — తనను అర్థం చేసుకోనట్టుగా ప్రిన్సిపాల్‌వైపు చూసాడు.

'పాపం! అమ్మాయిలు వేస్తామంటే మనం అబ్జెక్ట్ చేయటం ఏమీ బాగాలేదు. పార్టిసిపేట్ చేయమని బతిమాలుతున్నప్పటికినీ కొన్ని కాలేజీలలో ముందుకు ఆడపిల్లలు ఫ్రీగా మూవ్ కావటంలేదు. మన కాలేజీలో ఈ పరిస్థితికి ఆనందించాలి. ఒకతడవ అవమానింపబడినప్పటికినీ లెక్కచేయకుండా ముందుకు వచ్చారంటే— హర్షించాలి. కాబట్టి'....ప్రిన్సిపాల్‌గారు నవ్వుతూ గిరీశం మొహంలోకి చూశారు.

—'మీ ఇష్టం సార్! నాకు వాళ్ళ నాటకాన్ని వేయనీయకుండా ఏదో బావుకుందామని లేదు. ఒకవేళ ఆ ఉద్దేశ్యమే నాకుందని మిస్. శిరీష అనుకున్నట్లయితే ఆమె పూర్తిగా పొరబడింది' శిరీషవైపు చూస్తూ ప్రిన్సిపాల్‌కు చెప్పాడు గిరీశం

శిరీష ఏమీ మాట్లాడలేదు కానీ అతనివైపు చూసి తలవంచుకుంది

'మీ యిద్దరికీ రాజీకుదిరినట్లేగా'— ప్రిన్సిపాల్‌గారు అన్నారు — వారిద్దరినీ చూస్తూ కండ్లజోడు చాటుచేసుకుని ఆయనకండ్లు నవ్వుతున్నాయి.

'రాజీ కేముందండీ ఇందులో' గిరీశం నవ్వాడు —ధీర కంఠితో — నవ్వుతున్న గిరీశాన్ని పరీక్షగా చూసింది శిరీష

ఇద్దరూ సెలవుతీసుకుని గదిబయటికి వచ్చేసారు.

'మీ కోపం పోయినట్లేనా—?' నవ్వుతూ అడిగాడు గిరీశం.

శిరీష సిగ్గుపడింది—

'మీరు—తతిమ్మా యాక్టర్స్‌కు చెప్పి ప్రిపేర్ అవండి — ఇవ్వాళ రెండునాటకాలు ఉంటాయి' అన్నాడు గిరీశం అక్కడినుంచి వెళ్ళిపోబోతూ—

'థాంక్స్' అన్నది ఆమె.

రెండు అడుగులువేసిన గిరీశం ఏదో జ్ఞాపకమొచ్చి వెనక్కితిరిగి శిరీషతో—'మాట' అన్నాడు— ఆమె అతనిదగ్గరికి వచ్చింది.

—'చూడండి— నాటికలోకి కావల్సిన పరికరాలూ— తతిమ్మా సరంజామా అంతా తెప్పించాలిగా' అన్నాడు గిరీశం.

అవునన్నట్టుగా ఆమె చూసింది.

—'లిస్టువేసి ఇవ్వండి — నేను ఇక్కడే వెయిట్ చేస్తుంటాను' అని అతను అక్కడ ఆగిపోయాడు.

తిరిగి ఇంకొకతడవ ఆమె కృతజ్ఞతలు చెప్పి వెయిటింగ్‌రూమ్‌వైపు నడిచింది.

గదికి చేరుకొని వెనక్కితిరిగింది శిరీష.

గిరీశం నవ్వుతూ ఆమెవైపుచూస్తూ అక్కడ నిల్చొనివున్నాడు. సిగ్గుతో ఆమె లోపలికి వెళ్ళింది— లిస్టును తయారుచేయటానికి.

సాయంకాలం నాలుగు గంటలయింది. రంగురంగుల తోరణాలతో, పెద్దపెద్ద ఆర్చీలతో, కళాశాల కళకళలాడుతూవుంది. బయటి ప్రేక్షకులు ఇంకా ఎవరూ రాలేదుకానీ విద్యార్థులు మాత్రం అప్పటికే వచ్చి జట్లుకట్టుకొని పచార్లు చేస్తున్నారు. కొంతమంది ఎగ్జిబిషన్ థియేటర్‌లో అమర్చిన పరికరాలనూ, వింతవింత వస్తువులనూ చూస్తూ ఆనందిస్తున్నారు. విద్యార్థి వాలంటీర్లు కోలాహలంగా అటూయిటూ తిరుగుతూ — అప్పటికి వచ్చిన కొద్దిమంది అతిథులను ఆహ్వానించి వారికి సీట్లు చూపిస్తున్నారు. కొంతమంది క్యాంటీన్‌లోకి వెళ్ళి కాఫీ ఫలహారాలను సేవిస్తున్నారు—

ఇవేమీ పట్టనట్టుగా — దూరంగా విసిరేసినట్టుగా — ఒకమూల పదిమందిమాత్రం దీర్ఘంగా చర్చించుకుంటున్నారు. వారు ఆలోచించే విషయం —'ఈరోజు ఆడపిల్లల నాటకం ఉంటుందా? ఉండదా?'

ఇంతలో అటుప్రక్కగామున్న గేటులోంచి రిక్షా వచ్చింది అందులోంచి గిరీశం దిగాడు. నల్లరంగు సూటులో అతను నిండుగా ఉన్నాడు.

మూలగా సమాలోచనలు చేస్తున్న పదిమంది లోంచి ఒకతను 'అతన్ని అడిగితే సరిపోతుందిరా!'

అన్నాడు— రిక్షాలోంచి దిగిన గిరీశాన్ని చూపిస్తూ.

గుంపు గిరీశంవైపు కదిలింది. స్టేజీలోకి అడుగుపెడుతున్న గిరీశం వారిని చూసి ఆగిపోయాడు

'ఏమిటండీ?' అన్నాడు నవ్వుతూ—

గుంపులోని నీలం రంగు సూటువ్యక్తి— కాస్త సందేహిస్తూ 'ఇవ్వాళ్టి నాటకాలు ఏమిటండీ?' అని అడిగాడు.

—'పుణ్యానికిపోతే'.... మనవిద్యార్థులు వేస్తున్న నాటకం — ఇహ అని ఏదో చెప్పబోయేడు గిరీశం.

'....ర్థినులు వేసేనాటిక ఏమీ లేదాండి?' గిరీశం మాటలను మధ్యలో తుంపుతూ ఒకకుర్రాడు అడిగాడు.

అతని జోకుకు — అర్థం అయినా కాకపోయినా అందరూ ఘొల్లున నవ్వారు.

తెచ్చిపెట్టుకోలు నవ్వుతో గిరీశం '—ఉంటుందనుకుంటానండీ!' అన్నాడు.

'భలే! మనకు మంచి కాలక్షేపం' అని ఇందాకటి కుర్రాడే అన్నాడు.

గిరీశం అనుమానంగా ఆగుంపువైపు చూశాడు అక్కడినుంచి ఆమూక కదిలిపోయింది.

రెండు నిముషాలు—వారిని చూస్తూ అక్కడే నిలబడిపోయాడు. కాసేపయినతరువాత తెప్పరిల్లినట్లుగా — అక్కడినుంచి కదిలి స్టేజీలోకి వెళ్లిపోయాడు గిరీశం.

అరుగంటలకు కళాశాల ఆవరణఅంతా జనంతో క్రిక్కిరిసిపోయింది — వేసినకుర్చీలు నిండిపోయి కొంతమంది అతిథులుగూడా వెనకాల నిలబడ్డారు. అంతమందిని అంతకుముందెన్నడూ కళాశాల ఆడిటోరియం చూడలేదు.

ప్రత్యేకంగా సందేశం ఇవ్వటానికి వచ్చిన ముఖ్య అతిథి ధారావాహికంగా మాట్లాడుతున్నాడు— ప్రేక్షకులకు నచ్చినమాట అతని నోటినుంచి వెలువడగానే — వారు విపరీతమయిన హర్షధ్వానాలతో సంతృప్తిని వెల్లడిస్తున్నారు.

గిరీశం మాత్రం గ్రీన్‌రూమ్‌లో ఉన్నాడు. అక్కడ నటులందరూ రంగులువ్రాసుకుని—స్టేజీ ఎక్కటానికి తయారవుతున్నారు. ప్రక్కగా వున్న రెండుగదుల్లో ఒకటి నటులకు—రెండవది నటీమణులకు గ్రీన్‌రూమ్‌గా ఏర్పాటుచేశారు మొదట ఆడపిల్లలనాటకం.

గిరీశం కూర్చున్నదగ్గరికి శిరీష మేకప్ వేసుకొని వచ్చింది. ఆమె ఈనాటికలో 'లేడీడాక్టరుగా' నటిస్తుంది. తెల్లని చీరమీద తెల్లని లాంగుకోటు వేసుకుని, 'స్టెతస్కోపు మెళ్లో తగిలించుకుంది' గుండ్రని రింగులు ఆమె చెవులకు వేళ్లాడుతున్నాయి. లేడీడాక్టర్ వేషానికి ఆమె బాగా నప్పిపోయింది.

గిరీశంతో 'ఎట్లావుందండీ మేకప్'? అన్నది చిరునవ్వుతో—గిరీశం తలెత్తి ఆమెను చూశాడు. నవ్వుతూ బాగుందన్నట్లుగా తలవూపాడు ప్రక్కనే వున్న కుర్చీలో ఆమెగూడా కూర్చొంది.

'ఛీఫ్ గెస్టు' ఉపన్యాస మయినతరువాత— ఫ్యాన్సీ డ్రెస్ కాంపిటీషన్ జరిగింది. రకరకాల వేషాలను ప్రేక్షకులు చూసి బాగా ఆనందించారు. తరువాత 'లైటుమ్యూజిక్ కాంపిటీషన్' బాగా పాడినవాళ్ళను మెచ్చుకోవటం—గొంతు జీరపోయి

# వార్షికోత్సవం

అపస్వరాలను పలికించినవాళ్ళను, 'దిగిపోరా నాన్నా!' అని పరిహసించటం—ఇదీ! ఇవ్వన్నీ అయిన తరువాత— గేమ్సు — స్పోర్ట్సులలో గెలిచిన వాళ్లకు —వచ్చిన అతిథివేళ బహుమతులు పంచిపెట్టారు.

ఇంతవరకూ కార్యక్రమాలన్నీ బాగా విజయవంతమయ్యాయి. ఇహ మిగిలినవల్లా రెండు నాటికలు — అందులో అందరూ అమితోత్సాహంతో ఎదురుచూసేది 'ఆడపిల్లల నాటిక' కోసం.

పదినిముషాలలో నాటిక మొదలుపెట్టారనగా —గిరీశంగొంతుక మైకులో ప్రతిధ్వనించింది— గోల తగ్గింది—అందరూ నిశ్శబ్దం.

'అతిథులారా! సోదర సోదరీమణులారా!

మీరంతా శ్రమతీసుకొని, మా కళాశాలకు విచ్చేసి, మా బ్యానర్ క్రింద నిర్వహింపబడుతున్న నాటికలు చూడటానికి ప్రదర్శిస్తున్న అమితో

---

"ఉన్న నాలుగు రాళ్లు అయిపోయాయి ఇప్పుడు డబ్బుతెస్తేనే పొయ్యిలో పిల్లి లేస్తుంది." దొంగపెళ్లాం మొగుడుతో మొరపెట్టుకుంది.

"సరేలే! బ్యాంకు మూసేవరకు కాస్త ఓపికపట్టు" దొంగ గొణిగాడు.

ఎ. గణేష్‌బాబు (రాజమండ్రి)

---

త్సాహానికి — యసోసియేషన్ తరఫున నా కృతజ్ఞతలు—

ఇప్పుడు—మా కళాశాల విద్యార్థినులు పాల్గొంటున్న నాటిక ప్రదర్శింపబడబోతోంది. కొంతమంది సోదరవిద్యార్థులకు నామనవి—పోయిన వార్షికోత్సవాలలో జరిగినగొడవలనుకూడా లెక్కచేయకుండా విద్యార్థినులు ముందుకువచ్చి తిరిగి ఇంకొకసారి నాటికలలో పాల్గొనబోవటం—హర్షించదగ్గ విషయం — మనకళాశాల పేరుప్రతిష్ఠలకు పోయినసారి జరిగిన అల్లరులు— చెరిగిపోని మచ్చను కల్పించాయి. ఈ సంవత్సరం — అటువంటివి ఏమీ జరుగవని నే ననుకుంటున్నాను.

ఆడపిల్లల నాటకానికి అల్లరిచేయకుండా కూర్చోవటం — మననియమం గౌరవించుకోవడం అని నేను మనవిచేస్తూ — నిశ్శబ్దంగా నాటికలను చూసి— మన యువనటులకు ప్రోత్సాహమిస్తారని ఆశిస్తూ ముగిస్తున్నాను.'

మృదువుగా ధ్వనించి గిరీశం గొంతుక ఆగిపోయింది.

తిరిగి నిశ్శబ్దం ఆ ప్రదేశంనుంచి జారుకున్నది

స్టేజీకి ప్రక్కగా అమర్చిన డోర్‌లోంచి గిరీశం బయటకు వచ్చాడు. తెర విచ్చుకుంది. ఆత్రంగా అందరూ అటువైపుచూశారు. —'శిరీష లేడీ డాక్టర్‌వేషంలో పేషెంటును పరీక్షిస్తున్నది—' హాస్పిటల్‌గదిగా అమర్చిన ఆసెట్ చూడ ముచ్చటగా వుంది. శిరీష ఆవేషంలో మరింత అందంగా వుంది, జనం కన్నార్పకుండా నాటకాన్ని చూడటంలో మునిగిపోయారు. గిరీశం అందరివైపూ ఒకసారి చూసి, తృప్తిగా నిట్టూర్చి వెనక్కి వెళ్ళిపోయాడు.

అర్ధగంట చాలా హాయిగా నడిచింది నాటిక. అందరూ కథలో లీనమయ్యారు. పాత్రధారిణులందరూ అతికినట్లుగా సరిపోయారు. ముఖ్యంగా శిరీష చాలాబాగా నటిస్తున్నది

ఎక్కడినుంచో 'ఢాం' మని బాంబు పేలింది.

ఉలిక్కిపడి ప్రేక్షకులందరూ వెనక్కితిరిగి చూశారు.

యాక్టర్ల డైలాగులు—భయంతో తొణికిపోయి స్పష్టంగా రాలేదు.

మూల్లమంది వెనకవైపుగా నిల్చొని నాటికను చూస్తున్న ఒకరౌడీ—మూక.

—గిరీశం అటువైపుగా పరుగెత్తాడు.

మళ్ళీకాసేపు నిశ్శబ్దం. భయపడిన విద్యార్థినులు ధైర్యాన్ని పుంజుకొని తిరిగి డైలాగులుచెప్పటం మొదలుపెట్టారు. ప్రేక్షకులతలలు తిరిగి స్టేజీవైపు మరిలాయి.

గిరీశం చీకట్లో తమప్రక్కనే వున్నాడన్న సంగతి ఆగుంపు గమనించలేదు. ఒకసర్కిల్‌లాగా ఆగుంపు నించునివుంది. మధ్యలో నీలిరంగుసూటువ్యక్తి నిల్చొనివున్నాడు. అందరికీ పైగచేసి అతను అగ్గిపుల్లగీసి—ఎవరికీ కనబడకుండా వారికి మధ్యలో వున్న బాంబుకు అంటించటానికి క్రిందకు వంగాడు.

ఈసారి బాంబుప్రేలలేదుగానీ — అతని వెంప పేలిపోయింది. అతను నిశ్చేష్టుడయిపోయాడు— గిరీశం అతని కోటుకాలరు పట్టుకుని బరబరా బయటికి గుంజుకోపోయాడు— వెనకగా కూర్చున్న ప్రేక్షకులను ఈ అల్లరి కాస్త భంగపరిచింది కానీ—ముందున్నవారికి అసలు ఏమీ తెలియదు.

గిరీశం ఆ వ్యక్తిని ఎడాపెడా గుద్దాడు. కసిగా 'రాస్కెల్!' అంటూ అతనిజుట్టు పట్టుకోబోయాడు— వెనకవాటుగా గిరీశంమీద ఆవిద్యార్థి అనుచరబృందం పడింది.

ఒకరుకాదు — ఇద్దరుగాదు— గిరీశం తట్టుకొని దెబ్బకుదెబ్బ తీయటానికి—పదిమంది.

దారుణంగా బాదారు గిరీశాన్ని—బాగాకొట్టి అతన్ని అక్కడ వదిలేసి పలాయనం చిత్తగించారు.

అసలే బడలికగావున్న గిరీశం ఈ దెబ్బలతో పూర్తిగా డీలాపడిపోయాడు. నాటిక జరుగుతున్న ఆడిటోరియంలోకి తూలుతూవెళ్ళాడు.

ఆడపిల్లల నాటికలో ఆఖరిసీనుకూడా అయిపోయింది.

గిరీశం కళ్ళముందు మసకగా తెరవాలటం కన్పించింది. ★

# సినిమా వార్తలు

11-వ పేజీ తరువాయి

ప్రముఖ నటుడు, చిత్ర దర్శక నిర్మాత శ్రీ వి నాగయ్య సమక్షంలో జరిగిన ఈ ముహూర్తంలో ఈ చిత్రంలో పాల్గొనబోయే నటీ నటులు చిత్ర జగతికి సంబంధించిన మిత్రులు పాల్గొన్నారు

ఈ చిత్రానికి నిర్మాత · లక్ష్మీనారాయణ సంగీతం: బి శంకర్రావు, దర్శకుడు: శ్రీ పి శ్రీనివాసరావు (బి ఏ)

"ధైర్యే సాహసే లక్ష్మీః' అని ఊరికే అనరు మరి!

* * *

"ఆ! ఏవిటో ఎంతైనా ఇవి సాంఘికాలు మనం పొద్దున లేచిందిమొదలు చూసే సంఘటనలేగా' అనుకోకండి జాగృతిని కల్గించేవి ప్రగతి కానజేసేవి సాంఘికాలేనని చాలామంది పెద్దలవాక్కు. 'కళ' పదం వర్తించేది జానపద, పౌరాణిక చారిత్రాలకేనని మీ సిద్ధాంతం. ... అదీ నిజమేనేమోలెండి ....మనకు కని పించనిదాన్ని కనిపింపజేసేది, మనకు తెలిసిందాన్ని కనిపింపజేసేది, మనకు తెలిసిందాన్ని మరింత అందంగా చేసేవి పౌరాణిక, జానపద చిత్రాలేనేమో లేకపోతే ఇన్ని జానపద, పౌరాణిక చిత్రాలు ఎందుకు తయారౌతున్నట్టు పైగా అదేదో పౌరాణికచిత్రాన్ని రంగుల్లో సింగారిస్తున్నార్టగా? ఏవిటి చెప్మా అది... అది......



అంజలీపిక్చర్స్ 'స్వర్ణమంజరి'లో రామారావు, జయంతి.

## లవకుశ

రామాయణంలో ప్రతిఘట్టము ఓ మధుర కావ్యంట. అలాంటిదాన్ని ఎవరెన్నిసార్లు రాసినా, చదివినా తనివిదీర దన్నాడో కవిజనసమ్రాట్. మరి దాన్ని చిత్రంగాతీస్తే కూడా అంతేగా! వెనకెవరో తీసినా మళ్ళీ లలితా శివజ్యోతి ఫిలింస్‌వారుకూడా వర్ణచిత్రంలో చెమ్మక్కుస్తుంది కూడా అందుకే.

సీతారాములుగా అంజలీదేవి, రామారావులు, లక్ష్మణుడుగా కాంతారావు పాల్గొంటున్న ఈ వర్ణమయ చిత్రంలో నాగయ్య, రమణారెడ్డి, కన్నాంబ, రేలంగి గిరిజ, సూర్యకాంతం, ధూళిపాళ, సత్యనారాయణ శోధన్‌బాబు తదితరులు పాల్గొంటున్నారు చిత్రానికి బాణీలు: ఘంటసాల, దర్శకుడు: సి. పుల్లయ్య, సి యస్. రావు నిర్మాత: శంకరరెడ్డి.

ఈ చిత్రం త్వరలో విడుదలైతే రంగుల్లో తయారైన మొదటి సినిమా తెలుగు చిత్రమౌతుం దేమో కూడా

అసలు ఆ శ్రీరాముడేంచేసినా మనకు తెలియటానికి కారణమైన వ్యక్తి ఇంకొకరు అతడే ....

## వాల్మీకి

ఈ ఋషి జీవితాన్ని జూపిటర్ ఫిలింస్‌వారు తెర కెక్కిస్తున్నారు రాముడుగా, రావణుడుగా, మాధవుడుగా, అకలంక బ్రహ్మచారి భీష్ముడుగా ప్రశంసలు పొందిన రామారావు వాల్మీకి భూమికను ఆంధ్రలోకం దర్శించబోతున్నారు కాంతారావు, రఘురామయ్య, పద్మనాభం, రాజసులోచన, శారద, మీనాకుమారి పాల్గొంటున్న ఈ చిత్రం శ్రుతి ఘంటసాల, గతి సముద్రాల (సీ) ఛాయ రెహమాన్, కళ శేఖర్ దర్శకుడు సి. యస్ రావు

* * *

"అరెరే! మొహం అలా పెట్టేశారేం! పురాణాలు పానకంలాంటివని మీరేగా అన్నారు అప్పుడే మొహం మొత్తిందా! పోనీ జానపదాలు చూద్దాం.

## స్వర్ణమంజరి

అన్నివిధాలా అతి భారీగా, కళాత్మక జానపదంగా చేయాలనిఅంజలీ (పిక్చర్స్)వారుచేస్తున్న ప్రయత్నం "స్వర్ణమంజరి"గా రూపొందబోతుంది. పున్న



రికార్డిస్టు ప్రక్కన 'రికార్డిస్టు'గా రేలంగి. విజయ ల్యాబ్ లో కె. ఎ. పార్థసారధి, రేలంగి. ఫోటో : [illegible]

**తెలుగు పత్రికలన్నింటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది!**

# సినిమా వార్తలు

...తంగా ప్రకృతి దృశ్యాలు, కత్తియుద్ధాలు, సంగీ...లవు విశేషాలు గల ఈ చిత్రం అతి త్వరలో విడుదల చేస్తారట. రామారావు, అంజలీదేవి రాజనాల, నాగయ్య, పద్మనాభం, కన్నాంబ, జయంతి, మీనాకుమారి పేకేటి ఇంకా భారీగా తారాగణం పాల్గొంటున్నారు నిర్మాత ఆదినారాయణరావు సంగీత దర్శకత్వంతో తయారయ్యే ఈ చిత్రాన్ని ఆదిఇరాని, మల్లిఇరాని (ఛాయ), మల్లాది రామకృష్ణశాస్త్రి (రచన), శేఖర్, వాలి(కళ), వేదాంతం రాఘవయ్య (దర్శకుడు) సర్వవిధ సుందరంగా తయారు చేయాలని కృషి సల్పుతున్నారు

ఇదే జాతి (జానపద)కి చెందిన చిత్రం త్వరలో తయారు కాబోతోంది. అదే........



నవశక్తి ఫిలింస్‌వారి 'కలిమిలేములు'లో

సురభి బాలసరస్వతి

## మదనకామరాజు కథ

శతదినోత్సవచిత్రం 'శ్రీ భట్టివిక్రమార్క' దర్శకుడు విఠలాచార్య విఠల్ ప్రొడక్షన్స్ పేరిట రూపొందించబోయే ఈ చిత్రంలో కాంతారావు, అనూరాధ, రాజనాల, రాజశ్రీ, బాలకృష్ణ, మీనాకుమారి, హరనాథ్, జయంతి, సత్యనారాయణ, శాంతి, లంకసత్యం, చంద్రసేన, ఎ. యల్. నారాయణ, చిట్టి, నాటకాలనుండి చిత్రరంగానికి చెంగున ఎగిరివ నటుడు ధూళిపాళ, మహేశన్, పి. కృష్ణమూర్తి, శ్రీకాంత్ నటిస్తున్నారు. రచన: జి. కృష్ణమూర్తి (బి.ఎ.) సంగీతం రాజన్, నాగేంద్ర, ఛాయ చంద్రన్, స్టూడియో గోల్డెన్, దర్శకుడు: విఠలాచార్య.

* * *



'మాయామోహిని'లో లీలావతి.

## సినిమా వార్తలు

అసలన్నిటికన్న కష్టమైనవని చారిత్రక చిత్రాలు నిర్మించటం అది కత్తిమీద సాములాంటిది వాస్తవిక చరిత్రాత్మక ఘట్టాలు ఆధారంగా ఆ సన్నివేశాల మనుగడకు భంగం కలిగించకుండా, వాటి చుట్టూ అల్లుకుపోవటమనేది త్వరగా సాధ్యమయ్యేపని కాదు ఒకవేళ సాధ్యమనుకుని ప్రయత్నించినా, దాన్ని పట్టుకొని ఏ చారిత్రకుడో ఈ సన్నివేశం చరిత్రలోలేదు అని ఓ అభాండం పారవేయవచ్చు. అయినా అన్నిటికి సిద్ధపడి పనిచేస్తే ఫలానికి కొదవ లేదని "నమ్మి" గౌతమీవారు భారీగా కళాత్మకంగా రూపొందిస్తున్న చిత్రమే

### మహామంత్రి తిమ్మరుసు

అప్పాజీ అండదండలలో విజయనగర సామ్రాజ్యాన్ని ప్రవృద్ధం చేసిన కృష్ణదేవరాయలు తన తొందరపాటువల్ల పుత్ర వియోగంవల్ల కలిగిన ఆక్రోశంవల్ల, అప్పాజీఆపదలపాలైన విధాన్ని చిత్రించే ఈ చరిత్రాత్మక చిత్రంలో రాయలుగా రామారావు, మహామంత్రి తిమ్మరుసుగా గుమ్మడి, రాయల అప్రతిష్టకు, అప్పాజీకి కలిగిన ఆపదలకు కారణమైన ప్రతిస్పర్థులు ప్రతాపరుద్ర గజపతి, అతని సోదరుడు హంవీరుడుగా ముక్కామల, లింగమూర్తి, ఇంకా ధూళిపాళ, మిక్కిలినేని, శోభన్‌బాబు, ప్రభాకరరెడ్డి, యస్వరలక్ష్మి, విజయలక్ష్మి, దేవిక, రాజశ్రీ ఇంకా పలువురు తారాగణం పాల్గొంటున్నారు

ఆంధ్రావని అతి త్వరలో సందర్శించబోయే ఈ మహామంత్రి తిమ్మరుసుకు నిర్మాతలు పుండరీకాక్షయ్య, రామబ్రహ్మం, దర్శకత్వం. కమలాకర కామేశ్వరరావు, సంగీతం పెండ్యాల, ఛాయ డి యల్ నారాయణ (అన్నయ్య)

ఇవికాక ఇంకా కొత్త రకాల చిత్రాలు కూడా ఉన్నాయ్ ఉదాహరణకి ....

"ఫుల్‌స్టాప్!"  ★

# సరాగమాల

15-వ పేజీ తరువాయి

పాడిన కంఠం జానకిదో లేక "రసావుట్ట జంత్ర గాత్రముల రాల్గరగించు విమల గాంధర్వంబు విద్యమా" కనే గంధర్వకన్యదో, లేక "కనక నగసీమ గల్పవృక్ష ములవిడ బచ్చరాబట్టుగమి రచ్చవట్టుమా" కనే కిన్నెర కాంతదో లేక "పద్మసంభవ వైకుంఠ భర్గసభలు సాము గరిడీలుమా" కనే అచ్చరదో తెలియుట కష్టము. ఆ సంగీతము పాడుటలో సౌలభ్యము, అసంగతులు వేయుటలో ఆశౌలభ్యము గమనిస్తే, పై ముచ్చురినిమించిన కంఠం వీరిదని తోచక మానదు.

* * *

ప్రజాశక్తి జి. ఇ. 35289.

నవరస పుష్టితో శ్రోతలకు రసమయతుష్టి కలిగించేది విశ్వనాథన్ రామ్మూర్తి వారి రకరకాల వాద్యగోష్ఠి. ఈ ప్రత్యేక ప్రతిభ "లోకాల నేలే రాజకుమారి" అనే సుశీలా శ్రీనివాసుల యుగళ గీతం ప్రతి స్వరంలో ప్రస్ఫుట మౌతున్నది. "మిన్నున తారలు మెరిసినను, పున్నమచంద్రుని మించేనా, వల్లకిపై వయనించినను పామరుడే ప్రభువయ్యేనా" అని శ్రీనివాస్ అడిగిన తరువాత సుశీల విని విననట్లు వెనుక "ఆహాహా" అన్నది ఆనందాతిరేకానికి పతాకముద్రలాగ ఉన్నది చరణాల మధ్య బృందం "హై హై హై హై ఆహా" అనటం బాగుంది కాని, ఆ వెకిలినవ్వు వికారంగానే ఉంది సుశీల "నిర్మల ప్రేమకు సరితూగవులే, ప్రేమయె నిజమగు పెన్నిధిలే" అన్నప్పుడు శ్రీనివాస్ మురిసిపోతూ అన్న సంగతులు మేములు మరపిస్తాయి.

దీని రెండవప్రక్క జానకీ శ్రీనివాసులు తీయగా పాడిన "అందాల బాలయే" అన్నది పాశ్చాత్యధోరణిని చేయబడిన ద్వైతగీతం వాద్యాను సరణలో గిటార్‌ని చాలా హాయిగా ఉపయో గించారు మధ్యన వినిపించిన మంజీరాల మోత హృదయ ప్రాంగణంలో కింకిణుల నృత్యం చేయించ గలది. జానకి ఒక్క మాటా అనకపోయినా శ్రీని వాస్ మృదుశ్రుతికి మధురానుశ్రుతిగా పాడిన సంగతులు "తరుణ లావణ్యదీప్త తటిల్లత" లాగ, "వివిధ వర్ణ యుక్త విద్యుల్లత" లాగ వినేవారిని సంతోషంతో సంభ్రమ పరుస్తాయి.

ప్రాయశ్చిత్తం : జి. ఇ. 35286

కప్పల బెకబెకలు, చెట్ల పురుగుల లుకలుకలు, కీచురాళ్ల మోత, నక్కల కూత, ప్రళయకాల ఝంఝామారుతానికి పంజాలు జావుతున్న వింత ప్రమానుల భయంకర శబ్దాలు "పోతే పోనీ పోరా" పాట వాద్యగోష్ఠిలో వినిపిస్తాయి ఇంత పొందికగా ప్రకృతి శబ్దాలను పాటకు వింత అందాన్ని ఇచ్చేటట్లు యెవరూ ఉపయోగించుకోలేదు వెనుక 'ఓ' యంటూ వినిపించే కంఠం నిరాశ నిస్పృహల మధ్య నలిగి జీవితధ్యేయాన్ని మరచిన మూర్తీభవించిన శోకదేవతది. ఘంటసాల తమ స్వరపాత్రను విషాదరసంతో నింపి మరిక యింత ప్రతిభావిశేషంతో పాడలేమో అన్న భ్రమ కలిగించేటట్లు పాడారు. సాహిత్యం అదిరిపెట్టింది. ఉపమల్ని భావాల్ని ప్రతి అక్షరంలోనూ ప్రతిబింబిస్తున్నాయి.






ఇంతటి తెలుపుదనాన్ని ముందు ఎన్నడూ చూడలా
టినోపాల్ తెల్ల బట్టలను ఎంత తెల్లగా చేస్తుంది అంటే, మీదుప్పట్లు, గలేబులూ, టేబులుక్లాతులు నిజంగా మిరుమిట్లు కొలుపుతాయి మీతెల్ల చీరెలూ, ధోతీలు, షర్టులు, పేంట్లు అదనపు తెలుపుదనంతో మెరుస్తాయి. మీరు డబ్బును కూడా పొదుపుచేసుకోవచ్చు
మీ బట్టలను తెల్లగా చేసుకోవాలంటే మీరు ఎంతో డబ్బు ఖర్చు పెట్టనక్కర్లా మామూలుగా సబ్బుతో ఉతికి వాటిని టినోపాల్ కలిపిన నీటిలో వేయండి. టినోపాల్ ఎంత పొదుపు అయినదంటే ఒక బాల్చీడు బట్టలకు టీ చెమ్చాలో నాలుగోవంతు చాలు అంతేకాదు ఒక సారి టినోపాలులో వేస్తే ప్రతిసారి వేయనక్కర్లేదు టినోపాలు తెల్లదనం బట్టలను సులభంగా వదలదు.

టినోపాల్ స్విట్జర్లండ్ దేశపు, బాసెల్ కు చెందిన జె ఆర్. గైగి ఎస్.ఎ.వారి రిజిస్టర్డు ట్రేడుమార్కు.

గుర్తుంచుకోనండి




ఉత్పత్తిదారులు: సుహృద్ గైగి లిమిటెడ్ వారి వారి బరోడా — పోస్టు డిస్ట్రిబ్యూటర్లు: సుహృద్ గైగి ట్రేడింగ్ లిమిటెడ్ పో. బా. నెం. 965, బొంబాయి-1 బి ఆర్

TEL SISTA'S SG-170A.

ఒకటే ధుమధుమ అలా అని పెళ్ళాన్ని వేపుకు తినేవాడు అక్కడ పిల్లి ! — వామీదమాత్రం ఒంటికాలుమీద లేచేవాడు.

ఉపనయనం చేశాడు తనతోబాటు,—ఓ రాగిచెంబిచ్చాడు . నేను ఉహూ అన్నాను ఒక దరువేశాడు నేను దులిపేసుకున్నాను మరోవిడత ఉదికాడు ... పారిపోయి,—రాజావారితోటలో జామచెట్టెక్కాను దిగిరా, తాట వలుస్తానన్నాడు మానాన్న .. మూడురోజులు అట్లాగే ఉన్నాను .... కటుక్కాయలు కొరుకుతూ .. మా అమ్మ మజ్జిగా అన్నం కలుపుకొచ్చి .. అఘోరించావు కాని, దిగిరా అంది ఎదిరించేందుకన్నా సత్తువుండాలి తినివీడు!— అన్నాడు నాన్న ఉహూ అన్నాను సరే నీకర్మం నీది ఎన్నాళ్ళుండతావో ఎండు ... అని,— పదండి . అని, నాన్నను మళ్ళించుకుపోయింది .. నేను కిందికి దూకి,—మరోమాను మండ విరిచి,— ఛళాక్రా చేసి, — కూత పెట్టుకుంటూ మా అత్తయ్యగారి ఇంటికి చేరుకున్నాను .... ఆ యిల్లు చూపిస్తాగా

ఈ ఊళ్ళో కమామీషు ఏమిటంటే .... హనుమయ్యగారని, మా అత్తయ్య నాన్న మోతుబరి వేదం చెప్పుకుని వ్యవసాయంలోకి దిగి .. దస్తు కూడబెట్టి . . పాలుకొచ్చిన పక్కచేలు కలుపుకుని ముఫ్ఫైఎకరాల ఖామందు అయినాడు: అదోతరహా మనిషి పేదసాద నోకంట కనిపెట్టేవాడు కలిగినవాడు, పిసరంత పొరబాటు చేసినా కతి కట్టేవాడు. వస్తుతః పిల్లికి బిచ్చం వేసే తరహా కాడు పేదవాడింట పెళ్ళంటే అక్కడ ప్రత్యక్ష మయేవాడు నేనున్నానురా అనిపించేవాడు. అడగనివాడిని పిలిచి చేబదు లిచ్చేవాడు వాడు యివ్వలేకపోతే, — తిట్టి, మళ్ళీ పెట్టుబడి పెట్టేవాడు వాడు అదీ ఇదీ ఎగేసి, — ఊరు విడిచి, పారిపోతే,—వెంట తరుముకుపోయి, ఎక్కడున్నా వెదికి పట్టుకుని, సిగపాయదీసి తన్ని, మొగంవాచే చివాట్లు పెట్టి, వాడి కష్టసుఖం ఆరాతీసి, — వాడి లోటు తీర్చి వచ్చేవాడు అదో తరహా ..

ఓనాడు తనంత మోతుబరే ఒకాయన . కొడుకు బడికిపోవడం కలాయిస్తే . ఒళ్ళోకి లాక్కెళ్ళి కుర్రాళ్ళముందు పడేసి బాదాడు ఇది తెలియడంతోనే హనుమయ్యతాత, — పోయి వాళ్ళ అరుగుమీద తిష్ఠవేసి, — తనంత ఆసామినీ ... తన కన్న ఏడో ఆరో, పెద్దవాణ్ణి, గుమ్మం ఎక్కకుండా నిలవేసి, దుప్పటి దులిపినట్లు పట్టుకు దులిపేశాడు మొగం వాచిపోయేట్టు కొట్టాడు

తండ్రి పేరెట్టుకుంది, తన్నెందుకట్టా అప్రాచ్యుడా .

మీనాన్న నీ కడుపున పుట్టింది ... యిందుకట్టా

నీవు బ్రాహ్మడివా లుచ్ఛావాడివా ?—

ఒరేయి యీయేడు—మీనాన్న ఆబ్దికానికి . బ్రాహ్మణ్యం రాదు. నీ కిదే శిక్ష ... పోయి కాశీలో పెట్టి రా

ఒళ్ళో పిల్లలకు పప్పూ బెల్లాలు పంపించు 'మావూ'టే కాశీపో—తిరిగివచ్చి . మీ నాన్నపేరు చెప్పి గంగలో అభిషేకం చేయించి అప్పుడు యింటట

# చూర్ణిక

8-వ పేజీ తిరువాయి

కాలెట్టు ... ఒళ్ళో వాళ్ళకీ మాబోటి బయట వాళ్ళకీ యింత పప్పూ వణ్ణం పెట్టు' .. అని ఆసామిని, — అక్కడే ఆపి — లోపలికిపోయి ... 'అమ్మాయ్ .... మనవాడు కుర్రవేషాలు పోయేప్పటికి కాస్త కూకలేశాలే — అవన్నీ ఘట్టిదెబ్బ లనుకునేవ్ — అదిగో చూడు నక్కముద్దల్లేనే ఉన్నాడు . కాశీపోయి వచ్చేస్తాడు కాని, — కీత వార సంచిలో, కావలసినవి వేసి యియ్యి .. బత్తె ఖర్చులు మనింటిదగ్గర నుంచి . భోంచేసి పట్టుకెళ్తాడులే ... యాత్రకు వీడి సంపాదనలో వద్దు . ఫలం ఉండదు ' అన్నాడు:

అలాగే అన్నయ్యా ! అని,—అమర్చి యిచ్చింది ఆ యిల్లాలు

ఆసామి కిక్కురుమనకుండా .... చెప్పినట్లు చేశాడు .

హనుమయ్యగారి మాటంటే అందరికీ శివాజ్ఞ అది ఓ తరహా!—

"మీ పళ్ళు నిక్షేపంగా ఉన్నాయి. పాలిష్ చెయ్యవలసిన అవసరంకూడా లేదు." దంతవైద్యుడు గనులయజమానికి చెప్పాడు

"అయితేనేం! డ్రిల్లింగ్ ప్రారంభించండి. ఇవ్వాళ మంచి రోజు."

ఆర్. కుమారి లతా (ఒంగోలు)

ఆ కూతురుకీ తండ్రి పోలిక వచ్చింది .

ఒక్కతే కూతురు ... ఎనిమిదో యేడు ... పెళ్ళి కెదిగినట్లు లెక్క. వాళ్ళ లెక్కప్రకారం .. అందరూ ఆ సంబంధం అన్నారు, యీ సంబంధం అన్నారు కానీ కట్నం అక్కరలేదన్నారు ఎవరొచ్చినా ఆస్తిలో పిల్లకో రేజా యివ్వను .. ఎవరు చేసుకున్నా మా బాగే అన్నాడు హనుమయ్యగారు అంతటితో, ఒక్కడూ ముందుకురాందే

మా మామయ్య వారి యింటికి నిత్యమూ మధూకరానికి వెళ్ళేవాడు లచ్చమ్మే వేసేది

ఓనాడు అలాగే వెళ్ళగా ఆవేళకు హనుమయ్యగారు యింట్లో ఉండి ఒరే రాముడూ— ఆ జోలె అక్కడ పెట్టి—పంచపాత్రలో నీళ్ళు పారపోసి, కాళ్ళూ చేతులూ కడుక్కుని ఆచమనం చేసి రా అంగోస్త్రం అక్కడ పారేసి, నా ధోవతి కట్టుకుని,—పోయి, మీ నాన్నను పిలుచుకురా అన్నాడు .....

అలాగే పిలుచుకుని వచ్చాడు ..... చేతులు కట్టుకొచ్చాడు మాతాత!—

కూచోమన్నాడు!— కూచున్నాడు.

చూడు గంగన్నా .... ప్రతి నిత్యమూ వీడు జోలె కట్టుకు రావడం .... తన ముల్లేమో యిక్కడ దాచ పెట్టినట్టు ...

వీడు వచ్చేవేళకు యీవిడ పణుక్కుంటూ పళ్ళెంలో పప్పూ, అన్నం పెట్టుకు సిద్ధంగా ఉండటం ... ఏమిటో నాకు బాగుండలా ?— చూడగా ... చూడగా .... వీడికి వేళకింత తిండి పెట్టేందుకు పుట్టినట్టుందిది !— సరే అనేకుంటే పోలా ?—ముహూర్తం పెట్టిస్తే గాని, తర్లిరా!— అన్నాడు. మాతాత తబ్బిబ్బై .. చేతులు పట్టుకుని .... మీ అంతరమేమిటి — మా అంతరమేమిటి బావా !—చిన్నదానికి అన్యాయం చేస్తున్నావు ఏ మహారాజులింటో పడవలసిన పిల్ల .. నిదానంగా ఆలోచించుకో .... ఏనుగు నెక్కిస్తానన్నావు, కాని మాకా తాహతు ? — అని ప్రాధేయపడ్డాడు ..

గంగన్నా ... ఉపాదానానికి వస్తావ్ .... వత్తి బియ్యమే నీకు దక్కుడు—వీడు జోలె కట్టాడు .... అన్నప్రాప్తి అయింది:

ఆ జోలెలో,—మా లచ్చమ్మ పప్పూ అన్నం వేసింది

అదేమిదేమని .... నేను మా లచ్చమ్మనే వేశాననుకో—కాదంటావా ? ... అంటేమటుకు నే మారుకునేది గనుకనా .. మళ్ళీ నోరెత్తకు .. అన్నాడు అలా మా అత్తయ్య పెళ్ళి జరిగింది . మామయ్య యిల్లరికం వేళపట్టు కింత వ్రగా తినడం వీధి అరుగుమీద కూర్చోడం యిలా ఏడేళ్ళు ఎండ కన్నెరగకుండా పెరగడంతో,— మాంచి నునుపు తేలాడు ఓ యింటివాడైనాడు ..

వాళ్ళకు యిల్లప్పగించి నిశ్చింతగా, ఆ పెద్దవాళ్ళిద్దరూ కాశీకి పోయి అక్కడే ఉండిపోయివారు. దక్షత అంతా లచ్చమ్మది. ఏడాదైంది, రెండేళ్ళయింది మామగారు యీ గడప తొక్కలేదు .. రామన్న అటూ పోలేదు చూసి చూసి ఏమిటిదని నిలవేసింది లచ్చమ్మ పోయి మీ అమ్మా నాన్నను పిలుచుకురా .. ఇంకా ఆ ఉపాదానా లెందుకు ?— అన్నది.

'నే తింటున్నా చాలదూ వాళ్ళ కెందుకులే నీ చేతిబిచ్చం' అన్నాడు రామన్న .

'అహా ! అలాగుటూ ?— బిచ్చానికొచ్చినా పెళ్ళికొడుకువే అనుకోడం తప్పైందేం !—నే నెవత్తెను ఒకరికి బిచ్చమెయ్యడానికి . మా నాన్నే నన్ను నీకు బిచ్చమేశాడు ..

నీవు బిచ్చాని వెందుకవుతావ్ ... యింత కూడోసి కొనిచ్చాడు మీనాన్న, పొట్ట గడవక అమ్ముడోయినా ననుకోరాదూ ?

నీ జోలిబుద్ధులు పోనిచ్చావ్ కావు యింతకూ ఏమిటి—వెళతావా— వెళ్ళవా ? —

చిత్తం చిత్తమని నీ అడుగులకు మడుగులొత్తుతూ—చెప్పినట్టు చెయ్యకపోతే—నాకు అన్నం పుడుతుందా ?—

ఓయబ్బో రోషం . ఆలిచేతి అన్నం తినడమే—నీకంత పట్టింపుగా ఉందేం?—పోనీ నీవింత వండి నాకింత పెట్టు .. ::

అందుకనే వారు నాతో ఆ ప్రస్తావన చేయకుండా వున్నా గౌరవంగా చూశారు:

బిడ్డలు పెట్టగా కూచుని తినవలసినంత అశక్త స్థితికి మేము రాలేదు. ఏదో మా కాలం ఇలాగే వెళ్ళిపోతుంది అంతగా ఒకరి అవసరా అంటూ కావలసివస్తే—నీవు ఉండనే ఉన్నావుకదా .యింత వరకూ ఏ ఇబ్బందిలేదు .. యిహముందూ ఉండదు ..

నాకు ఒక్కటే అమ్మా చింత. ..యీయనకీ చదువులేమిటి—అవి ఎప్పటిక్కాను ....

లక్షణంగా పిల్లా పాప కలుగవలసిన కాలంగదా.. ఎందుకు ఇలా చేశాడమ్మా. నీ వెంత అమాయకు రాలివి కాకపోతే .. అలా పంపిస్తావా?—వద్దనలేక పోయినావా?—

వారికి ఎదురు చెప్పడం .....యీజన్మకు చేత కాదు మామయ్యా!

పోనీలే అమ్మా ఒక్కత్తెవూ అక్కడెందుకూ—

సంజెదీపం పెట్టేందుకు .వారు తిరిగిరాగానే ఇద్దరంవచ్చి ఇక్కడ ఉండిపోదాం అని ఉంది:

మాకు అంత ప్రాప్తం ఉండాలికద.....

అదేమిటి మామయ్యా . చదువుమీద మొగం మొత్తి రేపీపాటికి తిరిగి రారూ..... వారిక్,—ఇంత పృటినుంచీ ఒకర్నొకరు విడిచిఉండటం అలవాటు లేదుకదా......

అచ్చమ్మ ఇంటికి తిరిగివచ్చింది .. తనకు చిన్న తృుడు దాదిగాఉండే ఓ అవ్వను రప్పించుకుని, తోడుంచుకుంది:—ఊరికే చేదోడుగా....నిజానికి అవి డకు తోడెందుకు?—

ఒకసారి,—అంటే రామన్న కాశీవెళ్ళిన కొత్తలో. ఆడకూతురు ఒంటరిగా ఉంటూందికదా అని,—మనకు భారాభాటం అనుకుని యిద్దరు దొంగలొచ్చారు దొడ్డితలుపు ఊతకెత్తి లోపలికొచ్చి,— వంటయింటి క్రింద కన్నం తవ్వుతున్నారు. అచ్చమ్మ కునుకు మీద ఉన్నా, ఎలాగో సడికట్టింది ... పిల్లిలా లేచి వెళ్ళింది—విశిరాత్రి ..వెన్నెల రోజులు. కాబట్టి, కాస్త మసకగా ఉన్నా..... మనిషి లీలగా కనబడు తున్నాడు: ఆ ఇద్దరూ ఆదరా, బాదరా, కొత్తపెట్టి కొట్టంటుకున్నట్లు, దెత్తికలు తీస్తున్నారు. అచ్చమ్మ ఒక్క ఉరుకురికి,—అందుబాటులో ఉన్నవాడిని వడుం విరిగేట్టు తన్నింది: రెండోవాడు ఉలికిపడేం తలో,—వాడిడొక్కలో మోచేత్తో ఒక్కపోటుపొడిచి, వాడు తూలేంతలో పిడికిలితో, —గడ్డం పగలేసింది

పడివాళ్ళు తెప్పరిల్లేలోగానే పక్కను మేటవేసిన కందికంప, — తలోపందెరు, — వాళ్ళమీదవేసి, — చేంతాడుతో మోపుకట్టినట్లు కట్టింది ...సరాసరి పెద్దకాపు యింటికి వెళ్ళింది. 'సన్నయ్యమామా ఏదిగానివేళ ఇద్దరు చుట్టాలెవరో వచ్చారు : నాకు గుర్తుపట్టడంలేదు ..... నీవొచ్చి,— ఒక్కసారి పలక రించిపో'— అనగా,— సన్నయ్య వెంటనే అర్థం చేసుకుని, —వచ్చాడు: ఇంటిల్లిపాదీ లేచారేమో ..... ఒక్క నిమిషంలో, ఆ కబురు ఊరుఅల్లుకుపోయి, వాడకట్టంతా వచ్చిపడ్డది....

వాళ్ళ కట్లూడదీసి,—ఫలానాపాలెంవాళ్ళని గుర్తు చేసుకుని సన్నయ్య కర్ర తిరగేయపోయినాడు అచ్చమ్మ కూడదంది· పాలెం మనిషిని పంపి, వాళ్ళ అలు బిడ్డల్ని రప్పించింది: వాళ్ళచేత,— వాళ్ళఎదుట తడి బట్టలతో ప్రమాణం చేయించింది· తలో రెండెక కాలు వ్రాయించి యిచ్చి,—పెళ్ళాం బిడ్డల మొగం

# చూ ర్ణి క

ఘూఘ్నా వరువుగా బ్రతకమంది తన బిడ్డలకు పారెట్టి పంపినట్లు వాళ్లని సాగనంపింది మళ్లీ ఈ ఊరికి దొంగంటూ రాలేదు అలాటి మనిషి మా అత్తయ్య!

అది జరిగిన పదేళ్లకు నేను పుట్టాను

అప్పమ్మ వేయికళ్లతో కనిపెట్టిచూస్తూ అత్త మామల ముప్పు దాటేసింది అప్పటికి రామన్న కాశీ వెళ్ళి పుష్కరం దాటింది

అప్పట్నించే,—నేనూ అక్కడికి పారిపోయిరావడం:

నిజం చెప్పేశాను: అదేమనలేదు—కూకలేయ లేదు— మీగడవేసి ముప్పొద్దులా మేపేది ..

నాకు జామచెట్టంటే ప్రాణమని చెప్పానుగా యిక్కడ,—నాగేశ్వరస్వామి ఆలయంలో అదిగో ఆ కనబడుతున్నదే అక్కడ ఓమాంచి జామచెట్టుంది నేను ఊరుపట్టి తిరుగుతున్నాను అక్కడికి చేరుకున్నాను

ఆ జామచెట్టుమీద, ఓ అమ్మాయి కనిపించింది. మూగది-కాకిలాగాఉంది నన్నుచూసి మూగ సైగలు చేసింది· నేనూ కొమ్మ కెక్కాను ఓకాయ నామీదికి విసిరింది — పంట కరుచుకున్నాను,యిహగొంతెత్తింది మూగది,కురూపి,- మతిలేనిది పాడింది చూసుకో నేను నేర్చుకున్న రవంత సంగీతం ఆ జామచెట్టుమీదే

పొద్దుననగా చద్దన్నం తినివచ్చాను తిరిగి చూసేప్పటికి పొద్దు గ్రుంకింది. క్రిందికి దూకాను మళ్లీ వస్తానని సైగచేసి,—యింటికి పరుగెత్తాను అత్తయ్యతో ఈ సంగతి చెప్పాను నవ్వి ఊరుకుంది·

ప్రొద్దునవగా పోయి రాకపోతే – నాచేతి బువ్వ నీకూ వెగటైందేమో అనుకున్నా(నా భడవాకానా— అది,-మహాయోగినిరా, పుట్టి బుద్దెరిగింది మాట రాలేదు- పాటొచ్చింది ఆ జామచెట్టుమీదే ఉంటుంది ఎన్నడో ఓనాడు దిగిందో,— ఏ కొబ్బరిచెట్టుకో ఎగ(బాకి— బోండాం అక్కడే పగలేసి ఆనీరు త్రాగి వస్తుంది· అందరూ దానికి చేయెత్తి మొక్కుతారురా అంది నాకు చెప్పరాని సంతోషం వేసింది . ఎన్నోరోజులు అలా జామచెట్టుమీద గడిచినాయి - ఆ గొంతుతో కలిపి పాడటం నాకు అలవాటైంది·

అలా గడవగా,—ఒకనాడు ఆపిల్ల గొంతెత్తలా— నన్ను పాడమని సైగ చేసింది ఎలా పాడానో ఎంత సేపు పాడానో నాకే తెలియదు చివరకు ఓపళావికి ఒళ్లుతెలిసి చూదునుగా,— కోతిపిల్లలాగా కొమ్మలూపుతూ ఒకటే మూగగోల చేసింది – నేనున్న కొమ్మమీంచి నన్ను దులిపేసింది మళ్లీ చెట్టుకు ప్రాకబోతే కొమ్మలు విరిచి విసిరేసింది—పొమ్మని సైగచేసింది నేను బిక్కమొగం వేసుకుని,—యింటికి తిరిగివచ్చాను, మానాన్న ప్రత్యక్షం అత్తయ్య అంటే ఆయనకు అమిత గౌరవం కొంత జంకూ ఆవిడ ఎదుట ధాముధూములు చేయకుండా, మెల్లిగా లాలించి బుజ్జగించి, యింటికి లాక్కెళ్లి అక్కడ తాటవల్చే సన్నాహంమీద వచ్చాడు—ఆయ్య వలా అపేక్షగా లాలనగా మాట్లాడటంతో నాకు మరింత భయమేసి,— నేను రానన్నాను తెల్లారనీ ముక్కు మన్నుకాకుండా ఈడ్చుకెళ్లకపోతే — అన్ని

అయినా అని వాలుక కరచుకుని అత్తయ్యతో పర్ణి వెప్పబోయాడు. ఆవిడ నవ్వి ఊరుకుంది:

నేను రాత్రంతా నిదురపోలేదు .... తెల్లవారు ఝాముున, ఆయన మేల్కొనేవేళకు కాలికి బుద్ధి చెప్పాము: చేరుకున్నా—పట్నం —మనకథకేంగాని,—

అక్కడ మా అత్తయ్య షష్ఠిపూర్తి—యింకా నాలుగయిదేళ్లుందనగానే ఎందుకో ముహూర్తం పెట్టించింది. అధిక మాసాలతో సరిపెట్టుకోవచ్చు ఘలే అని, పెద్దలకు చెప్పింది.... చుట్టుపక్కల పది గ్రామాలవారు వచ్చారు: తంతు ప్రారంభం అయింది: పలక్షణంగా జరిగింది .... అత్తయ్య ఎవరూ చూడ కుండా ఒక్కసారి కళ్లు తుడుచుకుంది—

ఆ వెనువెంటనే లక్షవత్తుల వ్రతం. .. ప్రతిదీ తనకు అర్థం చెప్పి—చేయించమంది—ప్రాయశ్చిత్తా అప్పీ......పురోహితుడు మొదట సరేనని,—ఒక ఘట్టా నికి వచ్చేసరికి కప్పదాటు వేయబోయి తటపటా యించగా,—అత్తయ్యఅమాంతం గొంతుపట్టుకుంది— ఆయనచేత చెప్పించింది .... నివ్వులు గ్రక్కుతూ,— అవత్తులూ, — ఆజ్యం, — హోమగుండంలో వడేసి,—ఏంబాబూ,—నాకు ముందే ఎందుకు చెప్పలేదు.. మీ తోడబుట్టినదాన్నికానా,—నయాంకాకపోయినా — వాచేత,—కలలోనైనా చేయని పనులు చేసినట్లు నలు గురిలో ప్రాయశ్చిత్తం చేయిస్తారా — అని నోరు చేసుకుంది. .ఆ మానవుడు కిక్కురుమనలేదు కాని, అమ్మా, అచ్చమ్మా—యిది పుణ్యకార్యం—యిలా అవాం

# చూర్ణిక

తరం వస్తే ఊరికి చెరువు. పీటలమీద పెళ్ళి కూల దోసినంత పాదిత్యం—ఎలాగైనా కళ్ళు మూసుకు కానిచ్చేద్దాం — అని బ్రతిమాలుకున్నాడు: తరిమ్మా బ్రాహ్మణ్యమూ అదే మాట అంది అచ్చమ్మ నవ్వి పోయి—మీదెత్తి కూలా—మీదక్షిణ మీకు ఎలాగైనా ముట్టుతుంది—ఊరికి చెరువు అంటే నేను కాదం టానా—కాని చేసేపని కళ్ళు తెరుచుకునే చేద్దాం— అని యావన్మందినీ,—ఆలయానికి దయచేయమంది—

జేమచెట్టుక్రింద నుంచుని చేతులు జాపింది: మూగపిల్ల ఆ చేతుల్లోకి వ్రాలింది—పార్వతి అని పేరెట్టి పెళ్ళికూతుర్ని చేసింది నాగేశ్వరస్వామివారికి- కన్యాదానం—తాను చేసింది కూతురికీ, అల్లుడికీ ఆస్తి కట్టబెట్టింది . ఊరిలో ఎవరికీ లేమి ఉండ రాదంది—తలిదండ్రుల ఆస్తి ఆదాయం—బిడ్డలంద రికీ అవసరానికి అక్కరకు వచ్చేట్టు చూడమని చెప్పింది—అందరికీ తనచేతులో దక్షిణ లిచ్చింది— అందులో ఒక్కరికి తప్ప పాదాభివందనం చేసింది .

ఎవరిళ్లకువారు పోయినారు—మూగపిల్ల మళ్లీ చెట్టె క్కింది—అచ్చమ్మ—గంధం పూసుకుని,—మధుపర్కం కట్టుకుని, మరో చీరా రైకా చేతపట్టుకుని,—రాత్రి రెండోఝామువేళ గుళ్లోకి వెళ్ళింది ఆ ఒక్కడూ అక్కడ నిదురలో ఉన్నాడు పాదములు తాకింది:

నిదుర తెలిసి కూర్చున్నాడు. పుట్టని బిడ్డకు పెళ్ళి చేశాం—దేవుడల్లుడైనాడు.. ఇంకా నే నిక్కడెందుకూ వన్ను తినుకు వెళ్లేందుకు ఎన్నటికైనా మీరు వస్తా రని తెలును. . నిన్న జరిగింది, నా వయస్సుకుకాదు, నా బిదువతనానికి షష్ఠిపూర్తి అది మీకే తెలును: అందుకే వచ్చారుకాదూ—

అవును షష్ఠిపూర్తిఅయితే మరో జన్మ ఎత్తి నట్టుకాదూ—

మి మ్మ ల్ని చూ డ క ముం దే మీరు వచ్చా రనిపించింది. . .ఎక్కడ కూర్చున్నారో తెలిసింది.... ఆలయంలో మీచేత దక్షిణ ఉంచుతూన్నప్పుడే . .. మరో పుటక పుట్టాను . .

పిల్లలు యిహ యిల్లు దిద్దుకుంటారు — మా అమ్మా నాన్నా లాగే మనం ..

తెల్లారేప్పటికి యిద్దరూ లేరు ....

అదీ మా అత్తయ్య సంగతి. యిప్పటికీ లక్ష ణంగా కాశీలో ఉన్నారు—నేను నాలుగయిదు పర్యా యాలు చూసివచ్చాను—ఎన్నడో ఓనాడు అక్కడికే జేరుకుంటాను .

మా గురువుగారి దర్శనం చేద్దామంటావా?— వారు ఆ జేమచెట్టుమీద యిప్పుడు లేరు—కొంత కాలానికే—వారూ ఎటో మాయమైనారు—

యిది దివ్యక్షేత్రం కాదా?—వచ్చాం,స్మరించాము— ఆలయంకేసి మొక్కాము—ఊళ్లో మనకేం పని,— పోదాం పద!—



# గళ్లనుడికట్టు - 105



## అడ్డం

1. మొగల్ సామ్రాజ్యానికి లోబడని ఒక మహో వీరుడు.
5 దాసురాలు పాక రిత్త కాకమునుపే కనిపిస్తుంది!
7. కాఫీ వంటిదే !
9 అర్ధకము.
10 వినత,—.
13 సమీపం ?
15. తునకలు చివర ఒకదానిని చూసి వ్రాసినదా ?
16. రాము వారిలో ఒక రాక్షసుని చంపినవాడు !
19 కందమయములో రెండు తగ్గించినట్లయితే చిందరవందర అయిన ఒక శబ్దాలంకారము.
20 వ్రాసేదానిలోనే ఉన్నాము !
21. నీరు.
23. కాలానికి సరిపోయినదా ?
26. వేరే శత్రువు పారిపోయినట్లైనా ?
27. స్థానములు.

## నిలువు

1. దుష్టులకు ఇష్టించేదా ?
2. [illegible]
3. [illegible]
4. [illegible] !
5. సర్పము.
6. ముఖంలో కనిపించేది.
8. వారి [illegible] !
9. సంతోషము సగంముంది : మరి కమలము తర్వాత !
11. అటవి [illegible] అంటే కోకిల !
12. 'కలువచూపాను' అంటే అవే కన్నుల వంటివా ?
17. కదలి ప్రయాణమా ?
18. రైలుస్టేషన్‌లో వినిపించవచ్చు !
22. విఘ్నం.
23. ఆరోహణము ప్రారంభం. 'మంచిది.'
24. సమూహం.
25. వర్ణం.

## 104-వ గళ్లనుడికట్టుకు జవాబు



గళ్ల నుడికట్టు విషయమై కొందరు పాఠకులు వ్రాస్తున్నారు: 1. ఈ నుడికట్టు కేవలం వినోదం కోసం మాత్రమే; 2. ఇవి మేమే తయారు చేసుకుంటాము; 3. ఇవి పూర్తిచేసి మాకుపంపి లాభంలేదు !

# న్యూ ఢిల్లీ లేఖ

7—వ పేజీ తరువాయి

...లో తేలికగా ఉక్కు ఉత్పత్తి జరగాలన్నారు. చైనాలో ప్రతి గ్రామంలోనూ ఉక్కు కర్మాగారాలు వెలిశాయి. భారతదేశానికి సహజంగానే వీటియందు ఆసక్తి కలిగింది వెంటనే అక్కడికి పరిశీలకబృందాన్ని పంపింది కాని ఒక సంవత్సరం గడిచాక చైనీయులకు కనువిప్పు కలిగింది కుటీరపరిశ్రమలలో ఉక్కు పరిశ్రమకు స్థానం ఉండాలని వారు అనటం మానేశారు

ఇదేవిధంగా చైనీయులు బలపాటంగా కమ్యూన్‌లు ప్రారంభించి, ఇప్పుడు విపరీతమైన కరువు తెచ్చిపెట్టుకున్నారు యుద్ధానంతరం ఎన్నడూ ఇంత తీవ్రమైన కరువు రాలేదు రష్యాలో భూముల యాజమాన్యానికి సంబంధించిన నిబంధనలు ఇది వరకే సడలించారు. మార్క్సు పరిశ్రమలను ఆధారంగా తీసుకుని తన సిద్ధాంతాలు రూపొందించుకున్నాడుగాని, వ్యవసాయాన్ని ఆధారంగా తీసుకో లేదని ఇప్పుడిప్పుడే కమ్యూనిస్టులు కూడా గ్రహిస్తున్నారు

ఇటీవల కొంతకాలంగా కమ్యూనిస్టు ప్రపంచాన్ని అనుకరించటానికి ప్రయత్నిస్తున్న భారత దేశం నేర్చుకోవలసిన పాఠం ఒకటి ఉంది సహకారవ్యవసాయక్షేత్రాలకు కమ్యూన్‌లకు తేడా ఉన్నా రెండూ ఒకజాతికి చెందినవే సహకార వ్యవసాయక్షేత్రాలలో ఫలసాయం సభ్యులందరికీ లభిస్తుంది భూమిపై యాజమాన్యంకూడా అంతే. మరోవిధంగా చెప్పాలంటే వ్యక్తిగతమైన యాజమాన్యం ఉండదు ఈ సందర్భంలో తరువాత ఎప్పుడో విలపించేకంటే, చైనాలో పంటలు ఎందుకు దెబ్బతిన్నాయో ముందే తెలుసుకుని సహకార వ్యవసాయానికి ఉపక్రమించటం మంచిది

సహకారశాఖమంత్రి చైనా వెళ్ళకుండా అమెరికా ఎందుకు వెళ్ళారో మరీ విచిత్రంగా ఉంది

సుమారు పదేళ్ళగా వ్యవసాయశాఖ సహాయ మంత్రిగా ఉంటున్న డా పంజాబ్‌రావ్ దేశముఖ్, ఆయనభార్య నాయకత్వాన భారతీయరైతు బృందం ప్రస్తుతం అమెరికాలో పర్యటిస్తున్నారు. సందర్భాన్నిబట్టి ఒకసంగతి జ్ఞాపకం వస్తోంది. డా దేశముఖ్ రెండేళ్ళ క్రితం నిర్వహించిన వ్యవసాయప్రదర్శనశాలాకు పద్దులు ఇంతవరకు సమర్పించలేదు

విదేశీ పర్యటనలకు సాంస్కృతిక వేదికలు చక్కని అవకాశాలు కల్పిస్తున్నాయికాబట్టి స్కాండినేవియా వెళ్ళిరావడానికి శ్రీ బ్రహ్మప్రకాశ్ "ఇండో—నార్డిక్ సంఘం" ఏర్పాటు చేశారు. ★




Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

